# చక్కని
# తెలుగు
# రాయడమెలా?

రచన:
వి. లక్ష్మణరెడ్డి, ఎమ్. ఏ.

Published by
D. VIMALA, B. Sc., B. T.,
and
A. SAROJINI
for
JANAHITHA PUBLICATIONS,
GANNAVARAM (A. P.)

★



★

వెల : రు. 3-50

★

పుస్తకాలు దొరకు చోటు :
జనహిత పబ్లికేషన్స్,
రాయనగర్ - గన్నవరం - కృష్ణాజిల్లా

★

ముద్రణ :
సాకేత ప్రెస్, విజయవాడ - 2

# మా మాట

మా మొదటి ప్రచురణ "చక్కని ఇంగ్లీషు రాయడమెలా ?" - అనే గ్రంథం అనేకుల ప్రశంసలందుకున్నది. Noun, Verb, Adjective లాంటి ప్రాథమిక విషయాల నుండి ఇంగ్లీషు వాక్యనిర్మాణంవరకు నేర్చుకునేందుకు ఉపయోగపడే పుస్తకం ఇది.

ఇంగ్లీషు భాషను నేర్చుకోవాలనుకునేవారికోసం మేము ప్రచురించిన రెండవ పుస్తకం "ఇంగ్లీషు సంభాషణ కళ" (The Art of English Conversation). ఈ పుస్తకం సహాయంతో ఏమాత్రం ఇంగ్లీషు భాషాజ్ఞానం కలవారైనా రెండు మాసాలకాలంలో ఇంగ్లీషు మాట్లాడే శక్తిని సంపాదించగలరనేది మా దృఢ విశ్వాసం. ఇంగ్లీషు భాషకు సంబంధించిన విషయాలు పై రెండు పుస్తకాల్లో తెలుగులో వివరించబడ్డాయి.

మా మూడవ ప్రచురణ "చక్కని తెలుగు రాయడమెలా?" - అనే ఈ పుస్తకంలో శిష్టవ్యావహారికాంధ్రభాషా ప్రాతిపదిక సూత్రాలను సాధ్యమైనంత క్లుప్తంగా, సరళంగా వివరించేందుకు ప్రయత్నం జరిగింది. గ్రాంథిక వ్యావహారికాల తేడా వివరించబడింది. కథానికారచన, గేయరచన,

లేఖారచన మున్నగు వాటికి సంబంధించిన విషయాలు గూడా వివరించబడ్డాయి.

మేము ప్రచురించిన **Learn Telugu** ఆంధ్రభాషా చరిత్రలో ఒక మైలురాయి. ఆంధ్రేతరులు హిందీ, ఇంగ్లీషు భాషలద్వారా తెలుగు నేర్చుకోవాలంటే ఉపయోగించే ఏకైక పుస్తకం. మేము ప్రచురించిన "వ్యాకరణాలంకార ఛందోదర్శిని" హైస్కూలు, కాలేజి విద్యార్థుల కుపయోగిస్తుంది. తెలుగు వ్యాకరణం, అలంకార ఛందో విషయాలూ సులభంగా ఇందులో వివరించబడ్డాయి.

మేము మున్ముందు ఆంగ్ల, ఆంధ్ర, హిందీభాషల్ని అధ్యయనం చేసేందుకు, ఆయాభాషలపై అధికారం సంపాదించేందుకు ఉపయోగించే పుస్తకాలు ప్రచురించేందుకు కృషి చేయగలమని తెలియజేయడానికి ఆనందిస్తున్నాం. తెలుగు ప్రజలు మాకృషిని ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

రాయనగర్, గన్నవరం.
(కృష్ణాజిల్లా) - ఆం. ప్ర.

ఇట్లు,
జనహిత పబ్లికేషన్సు.

# ముందుమాట

భారతదేశంలో హిందీ తర్వాత అధిక సంఖ్యాకులు మాట్లాడే భాష తెలుగు. షుమారు ఆరు కోట్ల ప్రజలు తెలుగు మాట్లాడుతారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగును అధికారభాషగా గుర్తించింది. పరిపాలనా వ్యవహారాలన్నీ తెలుగులోనే జరగాలని అనుశాసించింది. ప్రభుత్వం డిగ్రీస్థాయిలో కూడా బోధనాభాషగా తెలుగును ప్రవేశపెట్టింది. కేంద్ర పబ్లిక్ సర్వీసు కమీషన్ పరీక్షల్లో కూడా తెలుగుకు స్థానం లభించింది. ఇలా మూడు పూవులారు కాయలుగా తెలుగు వెల్లివిరుస్తోంది.

తెలుగు రచనా విధానాన్ని వివరించే ఉపకారక గ్రంథాలు చాలా తక్కువగా ఉన్నాయి. ఉన్న కొన్ని వ్యాకరణ పుస్తకాలు గ్రాంథిక భాషారచనకు కావలసిన విషయాల్ని వివరిస్తాయి. ఈ శతాబ్ది ప్రారంభంలో శ్రీ నందిరాజు చలపతిరావుగారు "ఉపన్యాసదర్పణము" - అనే గ్రంథాన్ని వెలువరించారు. అలాగే శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావుగారు 'వాడుక భాష — రచనకి కొన్ని నియమాలు' - అనే శీర్షిక క్రింద ఇప్పటికి ముప్పైఏళ్ళ క్రితం "భారతి"లో రెండు వ్యాసాలు రాశారు. ఇంగ్లీషులో ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి గారు

తెలుగుభాషకు సంబంధించినకొన్ని గ్రంథాలూ, వ్యాసాలూ వెలువరించారు. పై పేర్కొన్న రచయితల రచనలు ఈ పుస్తక రచనకు ఎంతగానో సహాయపడ్డాయి. ఆ రచయితలకు నా కృతజ్ఞతలు.

ఈనాడు సమస్త విషయాలకు వాహిక శిష్టవ్యావహారికం. కళాశాలస్థాయి శాస్త్రగ్రంథాలన్నీ శిష్టవ్యావహారికం లోనే వెలువడుతున్నాయి. తెలుగును మాతృభాషగా అభ్యసించేవారు మాత్రం గ్రాంథిక భాషను ఉపయోగించవలసి ఉంది. ఈ పుస్తకంలో శిష్టవ్యావహారికాన్ని రాయడానికి కావలసిన విషయాల్ని వివరించాను. వ్యావహారిక రూపాలకు సమానమైన గ్రాంథిక రూపాలు కూడా ఇవ్వబడ్డాయి. కాబట్టి వ్యావహారికం, గ్రాంథికం – అనే రెండు శైలీ విశేషాలకున్న తేడాల్ని విద్యార్థులూ, సామాన్యులూ సులభంగా గుర్తించడానికి ఈ పుస్తకం ఉపకరిస్తుందని విశ్వసిస్తున్నాను. ఒక్కమాటలో చెప్పాలంటే తెలుగు భాషపై అధికారాన్ని సంపాదించడానికి అనువైనమార్గాల్నీ, లేఖ్య పద్ధతుల్నీ వివరించడానికి ప్రయత్నించాను.

ద్వితీయభాగంలో కథానికారచన, గేయరచన, లేఖారచన మున్నగు రచనాప్రక్రియలకు సంబంధించిన విషయాలు వివరించబడ్డాయి. ఈ విధంగా తెలుగు భాషలో రచనకు ఇది ఒక కరదీపిక కావాలని నా ఆకాంక్ష. తెలుగు ప్రజలుచూపే

ఆదరాన్నిబట్టి ముందుముందు ఈ పుస్తకాన్ని అనేక శీర్షికలతో విస్తరిస్తాను.

ఇలాంటి పుస్తక రచనకు నన్ను ప్రేరేపించిన శ్రీ ఎం. వి. రామరెడ్డి, ఎం. ఏ., బి. టి., శ్రీ నల్లూరి వెంకటేశ్వర రావు, ఎం. ఏ గార్లకు నా ధన్యవాదాలు.

నా రచనా వ్యాసంగాన్ని మొదటి నుంచీ ప్రోత్సహిస్తున్న మా కళాశాల ప్రధానాచార్యులు శ్రీ తాతినేని శ్రీనివాసరావుగారికీ ప్రచురణకు దయతో అనుమతించిన మా కళాశాల పాలకవర్గానికీ సర్వదా కృతజ్ఞుణ్ణి.

నా ప్రయత్నాలకు ఎల్లప్పుడూ అన్నివిధాల అండదండలుగా ఉంటున్న వైశ్యరత్న ప్రింటింగ్ వర్క్సు (విజయవాడ) అధినేత శ్రీ నాళం సీతారామచంద్రమూర్తి, B. Sc., గారికీ సాకేత ప్రెస్ నిర్వాహకులు శ్రీ బి. యస్. రావు గారికీ నా కృతజ్ఞతలు.

మీ

వి. లక్ష్మణరెడ్డి.

విషయసూచిక

# 1

# మనం – మన భాష

మన దేశం ఆంధ్ర దేశం.

మనభాష ఆంధ్రభాష.

తెనుగు, తెలుగు—అనే శబ్దాల్ని పర్యాయ వాచకాలుగా వాడుతున్నాం.

ఆంధ్రశబ్దం ప్రస్తావన ఐతరేయ బ్రాహ్మణంలో ఉంది. ఈ బ్రాహ్మణం వేదకాలానికి చెందిన గ్రంథం. విశ్వామిత్ర మహర్షి పుత్రుల్లో కొందరు ఆయన ఆజ్ఞను పాటించక ఆమహర్షి శాపానికి గురిఅయ్యారని, వారే 'ఆంధ్ర, పుండ్ర, పుళింద, మూతిబ, శబరు'లని ఆ బ్రాహ్మణంలో ఉంది. ఈ కథనుబట్టి ఆర్యులైన ఆంధ్రులు దక్షిణంగా వ్యాపించి, అక్కడి ద్రావిడ జాతులవారితో కలసిపోయారని తెలుస్తుంది.

ఈ విధంగా దక్షిణాభిముఖంగా నడచినవారే తెనుగువారు. ద్రావిడ భాషల్లో 'తెన్' అంటే దక్షిణం. 'తెన్' అగువారు తెనుగువారు. వారుమాట్లాడేభాష తెనుగుభాష. భాషామాధుర్యం వ్యక్తమయ్యేటట్లు [ తేనె+అగును ] తెనుగైందని కొందరంటారు.

ఇక 'తెలుగు' పదం 'త్రిలింగ' శబ్దంనుండి పుట్టిందని పండితులంటారు. ద్రాక్షారామం, శ్రీశైలం, కాళేశ్వరం— అనే మూడు ప్రసిద్ధ శైవక్షేత్రాలకు త్రిలింగాలని ప్రతీతి. ఈ త్రిలింగాల మధ్యదేశం త్రిలింగదేశం. ఈ దేశభాషయే త్రిలింగభాష. త్రిలింగశబ్దభవం తెలుగు. తెలుగు శబ్దమే నేడు భాషాపరంగా విరివిగా వాడుకలో ఉంది.

భారతదేశంలోని అతి ప్రధానమైన భాషల్లో తెలుగు భాష ఒకటి. హిందీ తర్వాత ఈ దేశంలో అధికసంఖ్యాకులు తెలుగు మాట్లాడుతారు. భారతదేశంలో తెలుగువారు ఆరు కోట్లమంది ఉన్నారు. ఒక్క ఆంధ్రప్రదేశ్‌లోనేగాక తమిళ నాడు, కర్నాటక ప్రదేశాల్లోగూడా తెలుగు మాట్లాడేవా రున్నారు. మలేసియా మున్నగు విదేశాల్లోగూడా తెలుగు మాట్లాడేవా రున్నారు.

క్రీ.శ. 575 సంవత్సరానికిచెందిన ఎఱ్ఱగుడిపాడుశాసనమే ప్రస్తుతం మనకు లభిస్తున్న మొదటి తెలుగు శాసనం.

తెలుగులో నాలుగు ముఖ్యమైన ప్రాంతీయ మాండలికా లున్నాయి.

1. కళింగాంధ్రం — శ్రీకాకుళం, విశాఖపట్టణం మండలాలు.
2. మధ్యాంధ్రం — కృష్ణా, గుంటూరు, ఉభయగోదావరులు
3. పశ్చిమాంధ్రం — తెలంగాణా జిల్లాలు
   [ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్, ఖమ్మం, నల్గొండ, హైదరాబాద్, మెదక్]
4. దక్షిణాంధ్రం — ప్రకాశం, నెల్లూరు, కడప, కర్నూలు, చిత్తూరు, అనంతపురం జిల్లాలు.

మధ్యాంధ్రదేశంలోని శిష్టుల భాష ప్రామాణిక భాషగా పరిగణించబడుతుంది. ఆధునిక రచనల్లో, సినిమాల్లో, రేడియోల్లో ఈ భాషే ఉపయోగించబడుతుంది. ఆంధ్ర ప్రదేశ్‌లో తెలుగు రాష్ట్రాధికారభాష అయింది. తెలుగును కళాశాల స్థాయి విద్యాబోధనకు మాధ్యమంగా కూడా ప్రవేశపెట్టారు.

గ్రాంథికం, శిష్టవ్యావహారికం—అనే సుప్రసిద్ధ శైలీ విభేదం తెలుగులో ఉంది. వీటినిగూర్చి కొంత తెలుసుకొందాం ! ఉదాహరణకి గ్రాంథికంలో భావార్థకరూపాలైన చదువుట, వ్రాయుట, తినుట మున్నగు రూపాలు శిష్టవ్యావహారికాంధ్రంలో చదవడం, రాయడం, తినడం—అనే విధంగా ఉంటాయి. గ్రాంథికాంధ్రంలో పూర్ణానుస్వారాంతాలు ఉండవు. అవి "ము" వర్ణాంతాలుగా ఉంటాయి. మనము, చూచితిమి [చూచినాము], కొట్టుదుము మొదలగునవి గ్రాంథిక రూపాలు. మనం, చూశాం, కొడతాం—అనేవి పై వాటికి వరుసగా శిష్టవ్యావహారిక రూపాలు. పై రెండు శైలీ విశేషాలకు గల తేడా చూపడానికి ఈ విధంగా ఎన్ని ఉదాహరణలనైనా పేర్కొనవచ్చు. శిష్టవ్యావహారికాన్ని అభ్యసించవలసిన పనిలేదని కొందరివాదన. ఎందుకంటే శిష్టవ్యావహారిక రూపాలకు వాడుక భాషారూపాలకు తేడా లేదని వారిభావన. అది సరియైన వాదనకాదు. ఉదాహరణకు 'వత్తాడు'— అనే వాడుక భాషారూపానికి శిష్టవ్యావహారిక రూపం 'వస్తాడు'. అలాగే 'ఆడు' [వాడు],

'ఆళ్లు' [వాళ్లు]— మొదలగునవి వాడుక భాషారూపాలు. వాటి శిష్టవ్యావహారిక రూపాలను నేర్వవలసి ఉంది. మహాప్రాణధ్వనులు వాడుక భాషలోలేవు. శిష్టవ్యావహారికంలో ఉన్నాయి.

ఈ తర్వాతి ప్రకరణంలో గ్రాంథిక శిష్టవ్యావహారిక తేడాల్ని వివరించడంతోబాటు శిష్టవ్యావహారిక రచనకు అనువైన మార్గాలెన్నో వివరించబడ్డాయి. ఎందుకంటే తెలుగువారు సమాజంలో తమ పాత్రను నిర్వహించడానికి గ్రాంథికభాష ఉపయోగించదు. శిష్టవ్యావహారికాంధ్రమే ఉపయోగిస్తుంది.

క్రొత్తనీటిని చేర్చుకొని తర
గెత్తునదివలె ఎట్టిజాతియు
ముందు కేగిన యంత కాలము
మూడుపూవులు, ఆరుకాయలు — సినారె

# శిష్టవ్యావహారిక భాష – గ్రాంథిక భాష

"వ్యావహారిక భాష అందరికీ వచ్చినదే! అది వ్రాయడము నేర్చుకోనక్కరలేకుండానే వస్తుంది, బడులలో నేర్పడమెందుకు?"—అని కొందరు అంటు న్నారు గాని అది బాగా ఆలోచించి అన్నమాట గాదు. కాకి రూపమైన, కుక్క రూపమైన పెన్సలుతో కాగితముమీద గీతలుగీచిగాని, రంగులతో చిత్రించి గాని, బంకమట్టితో కూర్చిగాని... వ్యక్తపరచడము నేర్చుకోనిదీ సాధనము చేయనిదీ అందరికీ రాదేమి? కాకిని అందరూ చూస్తూనే వున్నారే! పెన్సలూ, రంగులూ, బంకమన్నూ అన్నీ ఎరిగినవే! సామగ్రి క్రొత్తదికాదే! పనిముట్లు చేతివేళ్ళనే. ఏ భాష అయినా కూర్చివ్రాయడము శిల్పము వంటిది. పొందికగా మాట్లాడడమైనా నేర్చుకొని సాధనచేస్తేగాని రాదు.

—గిడుగు వెంకటరామమూర్తి పంతులు

వ్యావహారిక భాషంటే మాట్లాడేటట్లు రాయడం కాదు. అసలు మనం మాట్లాడేటట్లు రాయడం సాధ్యంకాదు. మనం మాట్లాడేటప్పుడు ఒక అక్షరం కుదిస్తాం. మరొక అక్షరం సాగతీస్తాం. ఒకమాట విడిచిపెడతాం. మరొకమాట మళ్ళీ మళ్ళీ వాడతాం. వెనకమాట ముందూ, ముందుమాటలు వెనకా చెప్తాం. ఒకప్పుడు కొన్నికొన్ని మాటలే విడిచిపెట్టి

ఏదో ఒక సంజ్ఞతో పూర్తి చేస్తాం. ఒకప్పుడు రెండుమాటలు కలిపేసి ఒక్కమాటలాగే వాడతాం. ఒకమాట ఒక రూపంలో మొదటవాడి ఆ తర్వాత అదే మరో రూపంగా అంటాం. మరొకప్పుడు అదే ఇంగ్లీషులో చెప్పి తెనుగులో చెప్తాం. ఇన్ని రకాలగా ఉంటుంది మాట్లాడేభాష. మాట్లాడే మాటల్లోని ధ్వనులన్నీ మనం రాతలో చూపించడం మన తరంకాదు. మనం రాసేటప్పుడుకూడా ఇన్ని మోస్తర్లు గానూ ఉంటే మన రచన తిరిగి మనం చదువుకున్నా అర్థం కాదు, ఇతరులమాట చెప్పనవసరంలేదు. అంచేత మాట్లాడే టట్లు రాయడం అసాధ్యం. కానీ వ్యావహారిక రచనలను సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే మనకు ఏకత కనిపిస్తుంది. అంటే వ్యావహారిక రచనలుకూడా కొన్ని నియమాలకులోనై సాగు తున్నాయని తెలుస్తుంది. సాధన ఉన్నవాళ్ళ వ్యావహారిక శైలి ఇంచుమించుగా ఒకలాగే ఉంటుంది. వారు మాట్లాడ డంలో వచ్చేటటువంటి తప్పులన్నీ రాతలో రానియ్యరు. ఒకేమాటకు పలురూపాలు కల్పించరు. వ్యావహారికం కొంత సాధనమీాద శుభ్రంగా రాయవచ్చు.

నేటి తెలుగులో రచనలు చాలావరకు శిష్టవ్యావహారిక భాషలోనే సాగుతున్నాయి. సినిమాలు, వార్తాపత్రికలు, రేడియోలు మున్నగువాటిలో శిష్టవ్యావహారిక భాషే వాడుతున్నారు. నవలలు, గేయకావ్యాలు మున్నగు వాటిని శిష్టవ్యావహారికంలోనే రాస్తున్నారు. విశ్వవిద్యాలయాల్లో మాత్రం శిష్టవ్యావహారికానికి ఇంకా స్థానం లభించలేదు. విశ్వవిద్యాలయాల్లో చదువుకొనే విద్యార్థులు ఏది గ్రాంథిక

రూపమో, ఏది శిష్టవ్యావహారికరూపమో తెలియక తికమక పడుతుంటారు. ఈ అధ్యాయంలో శబ్దరూపాల్లో వ్యావహారికానికీ గ్రాంథికానికీ ఉండే విభేదాన్ని పరిశీలిద్దాం.

శిష్టవ్యావహారికంలో అరసున్నలూ, బండిరాలూ ఉండవనే విషయాన్ని మనం గుర్తించాలి. ద్రుతాన్ని విధిగా వాడవలసిన అవసరం వ్యావహారికంలోలేదు. కనపడరు అనవచ్చు, కనబడరు అనవచ్చు. చూశాను అనీ, చూశా అనీ అనవచ్చు. నుగాగమం అవసరం ఎక్కడో కానిరాదు. అనవసరంగా వాడిన వాటికి ఉదాహరణలు.

పెందలకడనే=పెందలకడే

వారిలో నున్నప్పుడు=వారిలో ఉన్నప్పుడు

ఈ క్రిందివాక్యంలో 'ను'లు అనవసరం.

"చక్కని ముఖం పవిత్రతను, సత్యమును, ప్రేమను జ్ఞాపకం తెస్తుంది.

నామవాచకాల్లో గ్రాంథికంలో 'ము' కారాంతంగా ఉండే శబ్దాలను శిష్టవ్యావహారికంలో అనుస్వారాంతంగా ఉచ్చరిస్తాం.

| గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|
| సామాన్యము | సామాన్యం |
| ప్రస్తుతము | ప్రస్తుతం |
| రోషము | రోషం |
| దోషము | దోషం |
| కుటుంబము | కుటుంబం |

| గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|
| కష్టము | కష్టం |
| మకుటము | మకుటం |
| భావము | భావం |

పై మాటల బహువచన రూపాలు చూడండి.

| | |
|---|---|
| దోషములు | దోషాలు |
| కుటుంబములు | కుటుంబాలు |
| భావములు | భావాలు |

క్రియల్లోగూడ 'ము' కారాంతానికి అనుస్వారాంత ఉచ్చారణ కనిపిస్తూంది.

| | |
|---|---|
| ఉన్నాము | ఉన్నాం |
| చేసినాము | చేశాం |
| వచ్చినాము | వచ్చాం |

పురుషత్రయ [ప్రథమ, మధ్యమ, ఉత్తమ] సర్వనామాలకు వచ్చే విభక్తి రూపాల్లో గ్రాంథిక వ్యావహారికాల తేడా గమనించండి.

| | | | ఉత్తమ | మధ్యమ | ప్రథమ | | |
|---|---|---|---|---|---|---|---|
| | | | | | మహద్వాచకం | మహతీవాచకం | అమహద్వాచకం |
| ప్రథమ | గ్రాంథికము | ఏక | నేను | నీవు, నీ | వాడు (అతడు) | ఆమె | అది |
| | | బహు | మేము (మనము) | మీరు | వారు | వారు | అవి |
| | వ్యావహారికం | ఏక | నేను | నీవు (నువ్వు) | వాడు (అతను) | ఆమె | అది |
| | | బహు | మేము (మనము) | మీరు | వాళ్ళు (వారు) | వాళ్ళు (వారు) | అవి |
| ద్వితీయ | గ్రాంథికము | ఏక | నన్ను | నిన్ను | వానిని | ఆమెను | దానిని |
| | | బహు | మమ్ము | మిమ్ము | వారిని | వారిని | వానిని |
| | వ్యావహారికం | ఏక | నన్ను | నిన్ను | వాణ్ణి (అతణ్ణి) | ఆమెను | దాన్ని |
| | | బహు | మమ్ము | మిమ్ము | వాళ్ళని (వారిని) | వాళ్ళని (వారిని) | వాటిని |
| తృతీయ | గ్రాంథికము | ఏక | నాతో | నీతో | వానితో | ఆమెతో | దానితో |
| | | బహు | మాతో | మీతో | వారితో | వారితో | వానితో |
| | వ్యావహారికం | ఏక | నాతో | నీతో | వాడితో | ఆమెతో | దానితో (దాంతో) |
| | | బహు | మాతో | మీతో | వాళ్ళతో (వారితో) | వాళ్ళతో (వారితో) | వాటితో |
| చతుర్థి | గ్రాంథికము | ఏక | నాకొఱకు | నీకొఱకు | వానికొఱకు | ఆమెకొఱకు | దానికొఱకు |
| | | బహు | మాకొఱకు | మీకొఱకు | వారికొఱకు | వారికొఱకు | వానికొఱకు |
| | వ్యావహారికం | ఏక | నాకోసం | నీకోసం | వాడికోసం | ఆమెకోసం | దానికోసం |
| | | బహు | మాకోసం | మీకోసం | వాళ్ళకోసం (వారికోసం) | వాళ్ళకోసం (వారికోసం) | వాటికోసం |

| | | | ఉత్తమ | మధ్యమ | ప్రథమ | | |
|---|---|---|---|---|---|---|---|
| | | | | | మహద్వాచకం | మహతీవాచకం | అమహద్వాచకం |
| పంచమి | గ్రాంథికము | ఏక | నావలన | నీకంటె | వానివలన | ఆమెకంటె | దానికంటె (చెట్టునుండి) |
| | | బహు | మావలన | మీకంటె | వారికంటె | వారికంటె | వానికంటె |
| | వ్యావహారికం | ఏక | నావల్ల | నీకంటే (నీకన్నా) | వాడివల్ల | ఆమెకంటే | దానికంటే (చెట్టునుంచి) |
| | | బహు | మావల్ల | మీకంటే (మీకన్నా) | వాళ్ళకంటే (వారికంటే) | వాళ్ళకంటే (వారికంటే) | వాటికంటే |
| షష్ఠి | గ్రాంథికము | ఏక | నాకు | నీయొక్క | వానికి | ఆమెకు | దానికి |
| | | బహు | మాకు | మీయొక్క | వారికి | వారికి | వానికి |
| | వ్యావహారికం | ఏక | నాకు | నీయొక్క | వాడికి | ఆమెకు | దానికి |
| | | బహు | మాకు | మీయొక్క | వాళ్ళకి (వారికి) | వాళ్ళకి (వారికి) | వాటికి |
| సప్తమి | గ్రాంథికము | ఏక | నాయందు | నీయందు | వానియందు | ఆమెయందు | దానియందు |
| | | బహు | మాయందు | మీయందు | వారియందు | వారియందు | వానియందు |
| | *వ్యావహారికం | ఏక | నాయందు (నాలో) | నీయందు (నీలో) | వానియందు (వానిలో) | ఆమెయందు (ఆమెలో) | దానియందు (దానిలో) |
| | | బహు | మాయందు (మాలో) | మీయందు (మీలో) | వాళ్ళయందు (వాళ్ళలో) | వాళ్ళయందు (వాళ్ళలో) | వాటియందు (వాటిలో) |

* షష్ఠీవిభక్తిప్రత్యయం 'లో' శిష్టవ్యావహారికంలో సప్తమీవిభక్తియందు ప్రయోగించబడుతుంది.

సంఖ్యావాచకాల్లో గ్రాంథిక వ్యావహారిక రూపాలలో తేడా ఉండే శబ్దాల్ని చూడండి.

| గ్రాంథికము | వ్యావహారికం |
| --- | --- |
| పదునొకండు | పదకొండు |
| పంౘ్రెండు | పన్నెండు |
| పదుమూడు | పదమూడు |
| పదునాలుగు | పదనాలుగు-పధ్నాలుగు |
| పదునైదు | పదిహేను |
| పదునాఱు | పదహారు |
| పదునేడు | పదిహేడు |
| పదునెనిమిది | పద్ధెనిమిది |
| ఇరువది | ఇరవై |
| ముప్పది | ముప్ఫై |
| నలువది | నలభై |
| ఏబది | యాభై, ఏభై |
| అఱువది | అరవై |
| డెబ్బది | డెబ్భై |
| ఎనుబది | ఎనభై |
| తొంబది | తొంభై |

క్రియా రూపాలలో గ్రాంథిక వ్యావహారిక రూపాలను పరిశీలిద్దాం. క్రియలలోనే గ్రాంథిక వ్యావహారిక భాషలకు విభేదం ఎక్కువగా కనిపిస్తూంది. కాబట్టి క్రియారూపాలలో వీటి తేడాను శ్రద్ధగా గమనించాలి.

# క్రియా రూపాలు

[ప్ర: ప్రథమ పురుషం; మ: మధ్యమ పురుషం; ఉ: ఉత్తమ పురుషం]

## వర్తమానకాలం

[చేయు, తెచ్చు, అను, కొట్టు - అనే ధాతువుల రూపాలు]

| | | గ్రాంథికము | వ్యావహారికం. |
|---|---|---|---|
| ప్ర॥ | (మహత్) | చేయుచున్నాడు | చేస్తున్నాడు |
| | | *చేయుచున్నారు | చేస్తున్నారు |
| | (మహతీ) | † చేయుచున్నది | చేస్తున్నది, చేస్తూంది, చేస్తోంది |
| | | *చేయుచున్నారు | చేస్తున్నారు |
| | (అమహత్) | † చేయుచున్నది | చేస్తున్నది, చేస్తూంది, చేస్తోంది |
| | | చేయుచున్నవి | చేస్తున్నాయి |
| మ॥ | | చేయుచున్నావు | చేస్తున్నావు |
| | | చేయుచున్నారు | చేస్తున్నారు |
| ఉ॥ | | చేయుచున్నాను | చేస్తున్నాను |
| | | చేయుచున్నాము | చేస్తున్నాం. |

---

* ప్రథమ పురుష బహువచన రూపాలలో మహద్వాచక, మహతీ వాచక రూపాలకు తేడా ఉండదు.

† ప్రథమ పురుష ఏకవచనంలో మహతీ అమహద్వాచకాల రూపాలకున్నూ తేడా ఉండదు. కాబట్టి ముప్ముందు వీటికి ఒక్కొక్క రూపంమాత్రమే ఇవ్వబడుతుంది.

| | గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|---|
| ప్ర॥ | తెచ్చుచున్నాడు | తెస్తున్నాడు |
| | తెచ్చుచున్నది | తెస్తున్నది, తెస్తూంది, తెస్తోంది |
| | తెచ్చుచున్నారు | తెస్తున్నారు |
| | తెచ్చుచున్నవి | తెస్తున్నాయి |
| మ॥ | తెచ్చుచున్నావు | తెస్తున్నావు |
| | తెచ్చుచున్నారు | తెస్తున్నారు |
| ఉ॥ | తెచ్చుచున్నాను | తెస్తున్నాను |
| | తెచ్చుచున్నాము | తెస్తున్నాం (ము) |
| ప్ర॥ | అనుచున్నాడు | అంటున్నాడు |
| | అనుచున్నది | అంటున్నది, అంటూంది, అంటోంది. |
| | అనుచున్నారు | అంటున్నారు |
| | అనుచున్నవి | అంటున్నాయి. |
| మ॥ | అనుచున్నావు | అంటున్నావు |
| | అనుచున్నారు | అంటున్నారు |
| ఉ॥ | అనుచున్నాను | అంటున్నాను (ము) |
| | అనుచున్నాము | అంటున్నాం (ము) |
| ప్ర॥ | కొట్టుచున్నాడు | కొడుతున్నాడు |
| | కొట్టుచున్నది | కొడుతున్నది, కొడుతూంది, కొడుతోంది. |
| | కొట్టుచున్నారు | కొడుతున్నారు |
| | కొట్టుచున్నవి | కొడుతున్నాయి. |

| | గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|---|
| మ॥ | కొట్టుచున్నావు | కొడుతున్నావు |
| | కొట్టుచున్నారు | కొడుతున్నారు |
| ఉ॥ | కొట్టుచున్నాను | కొడుతున్నాను |
| | కొట్టుచున్నాము | కొడుతున్నాం (ము) |

వర్తమానకాలంలో వ్యతిరేకార్థంలో భావార్థక క్రియా రూపం, దాని తర్వాత "లేదు"—అనేది చేరుతుంది.

| | |
|---|---|
| కొట్టుటలేదు | కొట్టడంలేదు |
| తినుటలేదు | తినడంలేదు |
| చేయుటలేదు | చేయటంలేదు |

## భూ త కా లం

[వచ్చు, చేయు, కొట్టు, గెలుచు—అనే ధాతువుల రూపాలు]

| | గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|---|
| ప్ర॥ | వచ్చెను; వచ్చినాడు | వచ్చాడు |
| | వచ్చెను; వచ్చినది | వచ్చింది |
| | వచ్చిరి; వచ్చినారు | వచ్చారు |
| | వచ్చెను; వచ్చినవి | వచ్చినాయి, వచ్చాయి |
| మ॥ | వచ్చితివి; వచ్చినావు | వచ్చావు |
| | వచ్చితిరి; వచ్చినారు | వచ్చారు |
| ఉ॥ | వచ్చితిని; వచ్చినాను | వచ్చాను |
| | వచ్చితిమి; వచ్చినాము | వచ్చాం (ము) |

| | గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|---|
| ప్ర\|\| | చేసెను; చేసినాడు | చేశాడు |
| | చేసెను; చేసినది | చేసింది |
| | చేసిరి; చేసినారు | చేశారు |
| | చేసెను; చేసినవి | చేశాయి |
| మ\|\| | చేసితివి; చేసినావు | చేశావు |
| | చేసితిరి; చేసినారు | చేశారు |
| ఉ\|\| | చేసినాను | చేశాను |
| | చేసినాము | చేశాం (ము) |
| ప్ర\|\| | కొట్టెను; కొట్టినాడు | కొట్టాడు |
| | కొట్టెను; కొట్టినది | కొట్టింది |
| | కొట్టిరి; కొట్టినారు | కొట్టారు |
| | కొట్టెను; కొట్టినవి | కొట్టినాయి, కొట్టాయి |
| మ\|\| | కొట్టితివి; కొట్టినావు | కొట్టావు |
| | కొట్టితిరి; కొట్టినారు | కొట్టారు |
| ఉ\|\| | కొట్టితిని; కొట్టినాను | కొట్టాను |
| | కొట్టితిమి; కొట్టినాము | కొట్టాం (ము) |
| ప్ర\|\| | గెలిచెను; గెలిచినాడు | గెలిచాడు |
| | గెలిచెను; గెలిచినది | గెలిచింది |
| | గెలిచిరి; గెలిచినారు | గెలిచారు |
| | గెలిచెను; గెలిచినవి | గెలిచినాయి, గెలిచాయి |

| | గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|---|
| మ॥ | గెలిచితివి; గెలిచినావు | గెలిచావు |
| | గెలిచితిరి; గెలిచినారు | గెలిచారు |
| ఉ॥ | గెలిచితిని; గెలిచినాను | గెలిచాను |
| | గెలిచితిమి; గెలిచినాము | గెలిచాం (ము) |

గమనిక:- భూతకాలంలో వ్యతిరేకార్థంలో గ్రాంథిక, వ్యావహారికాల్లో పెద్దగా తేడాలేదు. ధాతువు చివర స్వల్పమార్పుతో "లేదు" చేరుతుంది.
ఉదా॥ తినలేదు; చెప్పలేదు.

## 'ఉండు' ధాతురూపాలు ('To be' Verb forms)

తెలుగులో 'ఉండు' ధాతురూపాలకు భూత వర్తమానకాలాల్లో తేడాలేదు. అంటే ఒకేరూపాన్ని భూత కాలంలోనూ, వర్తమానకాలంలోనూ వాడుతారు. సందర్భాన్ని అనుసరించి అర్థం చేసుకోవాలి. ఈ విషయం శిష్ట వ్యావహారిక రూపాలకు మాత్రం వర్తిస్తుంది. గ్రాంథిక రూపాల్లో తేడా ఉంది.

ఉదా॥ **I am in the room**
**I was in the room** } నేను గదిలో ఉన్నాను.

"ఉన్నాను"—అనే క్రియారూపం వర్తమాన భూత కాలాల్లో ఒకేరూపంలో ఉంటుంది. వ్యతిరేకార్థంలో 'లేను, లేరు, లేదు' మున్నగు రూపాలు ఉంటాయి. ఈ రూపాలకు కూడా భూత, వర్తమానకాలాల్లో తేడాలేదు.

ఉదా॥ She is not in the room
She was not in the room } ఆమె గదిలో లేదు.

భూత వర్తమానకాలాల్లో మూడు పురుషల్లోనూ ఈ క్రింది రూపాలు ఉంటాయి.

| | ఏక | | బహు | |
|---|---|---|---|---|
| ఉత్తమ:- | నేను | ఉన్నాను | మేము<br>మనము | ఉన్నాం (ము) |
| మధ్యమ:- | నువ్వు | ఉన్నావు | మీరు | ఉన్నారు |
| ప్రథమ:- | మహద్వాచకం | | | |
| | వాడు<br>అతను<br>ఆయన | ఉన్నాడు | వారు<br>వాళ్ళు | ఉన్నారు |
| | మహతీవాచకం | | | |
| | అది<br>ఆమె<br>ఆవిడ | ఉన్నది<br>(ఉంది) | వారు<br>వాళ్ళు | ఉన్నారు |
| | అమహద్వాచకం | | | |
| | అది | ఉన్నది<br>ఉంది | అవి | ఉన్నాయి |

## భవిష్యత్ (తద్ధర్మ) కాలం

ఈ క్రింది సందర్భాలలో వస్తుంది.

1) అలవాటును తెలియజేసే పని జరిగేటప్పుడు;
ఉదా॥ నేను కాఫీ తాగుతాను.

2) ప్రసిద్ధమైన విషయాన్ని, విశ్వజనీనమైన సత్యాన్ని తెలియజేసేటప్పుడు;
ఉదా॥ సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు.

3) భవిష్యత్కాలంలో జరిగేపనిని తెలియజేసేటప్పుడు.
ఉదా॥ నేను రేపు వస్తాను.

ఆంగ్లంలోని **Present indefinite tense, Future indefinite tense** లలో వచ్చే క్రియారూపాలకు సమానంగా తెలుగులో ఈ ఒక్క క్రియారూపాన్నే ఉపయోగిస్తాం.

ఉదా॥ **I come** / **I shall come** } నేను వస్తాను.
**I play tennis** / **I shall play tennis** } నేను టెన్నిస్ ఆడుతాను.

[కొట్టు, తెచ్చు, పిలుచు, తిను, చేయు, పోవు
అనే ధాతువుల రూపాలు]

| | గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|---|
| ప్ర॥ | కొట్టును | కొడతాడు |
| | కొట్టును | కొడుతుంది. |

| | గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|---|
| | 1 కొట్టుదురు | కొడతారు |
| | కొట్టును | కొడతాయి |
| మ॥ | 2 కొట్టుదువు | కొడతావు |
| | కొట్టుదురు | కొడతారు |
| ఉ॥ | 3 కొట్టుదును | కొడతాను |
| | 4 కొట్టుదుము | కొడతాం |

గమనిక:- 1) కొట్టెదరు 2) కొట్టెదవు 3) కొట్టెదను 4) కొట్టెదము లాంటి రూపాలుకూడా గ్రాంథికంలో ఉన్నాయి.

| | | |
|---|---|---|
| ప్ర॥ | తెచ్చును | తెస్తాడు |
| | తెచ్చును | తెస్తుంది |
| | తెత్తురు(తెచ్చుదురు) | తెస్తారు |
| | తెచ్చును | తెస్తాయి |
| మ॥ | తెత్తువు (తెచ్చుదువు) | తెస్తావు |
| | తెత్తురు (తెచ్చుదురు) | తెస్తారు |
| ఉ॥ | తెత్తును (తెచ్చుదును) | తెస్తాను |
| | తెత్తుము (తెచ్చుదుము) | తెస్తాం |
| ప్ర॥ | పిలుచును | పిలుస్తాడు |
| | పిలుచును | పిలుస్తుంది |
| | పిలుతురు (పిలుచుదురు) | పిలుస్తారు |
| | పిలుచును | పిలుస్తాయి |

| | గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|---|
| మ॥ | పిలుతువు (పిలుచుదువు) | పిలుస్తావు |
| | పిలుతురు (పిలుచుదురు) | పిలుస్తారు |
| ఉ॥ | పిలుతును (పిలుచుదును) | పిలుస్తాను |
| | పిలుతుము (పిలుచుదుము) | పిలుస్తాం |
| ప్ర॥ | తినును | తింటాడు |
| | తినును | తింటుంది |
| | తినుదురు | తింటారు |
| | తినును | తింటాయి |
| మ॥ | తినుదువు | తింటావు |
| | తినుదురు | తింటారు |
| ఉ॥ | తినుదును | తింటాను |
| | తినుదుము | తింటాం |
| ప్ర॥ | చేయును | చేస్తాడు |
| | చేయును | చేస్తుంది |
| | చేయుదురు | చేస్తారు |
| | చేయును | చేస్తాయి |
| మ॥ | చేయుదువు | చేస్తావు |
| | చేయుదురు | చేస్తారు |
| ఉ॥ | చేయుదును | చేస్తాను |
| | చేయుదుము | చేస్తాం |

| | గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|---|
| ప్ర॥ | పోవును | పోతాడు |
| | పోవును | పోతుంది |
| | పోవుదురు | పోతారు |
| | పోవును | పోతాయి |
| మ॥ | పోవుదువు | పోతావు |
| | పోవుదురు | పోతారు |
| ఉ॥ | పోవుదును | పోతాను |
| | పోవుదుము | పోతాం |

## వ్యతిరేక క్రియారూపాలు

| | గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|---|
| ప్ర॥ | ఇయ్యాడు; ఈడు | ఇవ్వడు |
| | కొలువదు | కొలుచదు |
| | చెఱపరు | చెరచరు |
| | తలవవు | తలచవు |
| | రాడు | రాడు |
| మ॥ | తెఱవకుము | తెరచకు |
| | తెఱవకుడు | తెరచకండి |
| ఉ॥ | ముడువను | ముడుచను |
| | ముడువము | ముడుచం |

గమనిక:- వ్యావహారికంలో ధాతువును 'అకారాంతము' చేసి క్రియా ప్రత్యయాల్ని చేర్చడంవల్ల భవిష్యత్ (తద్ధర్మ) కాలంలో వ్యతిరేకార్థ రూపాలు సిద్ధిస్తాయి. [ ఉదా॥ వెళ్ళను, వెళ్ళడు మొ॥ ]

వ్యతిరేకార్థంలో ఈ కాలంలో అమహత్తు (మహతీ కూడ) లో క్రియా విభక్తులుగా 'దు, వు' ఉంటాయి; 'ది, యి' అనేవి రావు. [ ఉదా॥ తినదు, రావు, తినవు. ]

## శక్త్యర్థక క్రియారూపాలు

[ 'చదువు, అగు, వచ్చు' ధాతువుల రూపాలు ]

| | | |
|---|---|---|
| ప్ర॥ | చదువగలడు | ఈ రూపాలు గ్రాంథికంలో లాగే వ్యావహారికంలో ఉంటాయి. |
| | చదువగలదు | |
| | చదువగలరు | |
| | చదువగలవు | |
| మ॥ | చదువగలవు | |
| | చదువగలరు | |
| ఉ॥ | చదువగలను | |
| | చదువగలం (ము) | |

### 'అగు' ధాతు రూపాలు

| | | |
|---|---|---|
| ప్ర॥ | కాగలడు | ఈ రూపాలు గ్రాంథికంలో లాగే వ్యావహారికంలో ఉంటాయి. |
| | కాగలదు | |
| | కాగలరు | |
| | కాగలవు | |
| మ॥ | కాగలవు | |
| | కాగలరు | |
| ఉ॥ | కాగలను | |
| | కాగలం (ము) | |

## 'వచ్చు' ధాతు రూపాలు

| | | |
|---|---|---|
| ప్ర॥ | రాగలడు | ఈ రూపాలు గ్రాంథికంలోలాగే వ్యావహారికంలో ఉంటాయి. |
| | రాగలదు | |
| | రాగలరు | |
| | రాగలవు | |
| మ॥ | రాగలవు | |
| | రాగలరు | |
| ఉ॥ | రాగలను | |
| | రాగలము (ం) | |

వ్యతిరేకార్థంలో "లే"—అసమాపక క్రియారూపాలకు చేరుతుంది. ఉదా॥ రాలేను, రాలేడు మున్నగునవి.

## ప్రార్థనార్థకం

వ్యావహారికంలో ప్రార్థనార్థక ధాతురూపాల చివర బహువచనంలో 'అరడి' చేరుతుంది. ఏకవచనంలో కేవల ధాతురూపమే వస్తుంది. వ్యతిరేకార్థంలో వ్యావహారికంలో 'అకు, అక, వద్దు, ఒద్దు' లాంటివి చేరుతాయి.

| గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|
| చూడుడు | చూడండి |
| చూడకుడు | చూడకండి |
| కొట్టుము | కొట్టు |
| కొట్టకుము | కొట్టకు |
| చేయుము | చెయ్యి |

| గ్రాంథికము | వ్యావహారికం |
| --- | --- |
| చేయుడు | చేయండి, చెయ్యండి |
| చేయకుము | చేయకు, చెయ్యకు |
| చేయకుడు | చెయ్యకండి, చేయకండి |

## ఉభయ ప్రార్థనార్థకం

| | |
| --- | --- |
| చేయుదము | చేద్దాం |
| కొట్టుదము | కొడదాం |
| తెచ్చుదము (తెత్తుము) | తెద్దాం |
| తినుదము | తిందాం |
| కొనుదము | కొందాం |
| పోవుదము | పోదాం |
| ఆడుదము | ఆడుదాం |

ఇందులో వ్యతిరేకార్థ రూపాల్లేవు.

## ఆత్మనేపదం

| | |
| --- | --- |
| వండుకొను | వండుకను |
| వండుకో | వండుకో |
| చేసికొను | చేసుకొను |
| వెదకుకొను | వెదక్కొను |
| లాగుకొను | లాక్కొను |
| పట్టుకొని | పట్టుకు |
| తీసికొని | తీసుకు |
| తీసికోడు | తీసుకోడు |
| తీసికొనడు | తీసుకొనడు |

# ప్రేరణార్థకం

## [ధాతువు+ఇంచు]

| గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|
| వండించు | వండించు |
| కోయించు | కోయించు |
| వ్రాయించు | రాయించు |
| అనిపించు | అనిపించు |
| వినిపించు | వినిపించు |
| తినిపించు | తినిపించు |
| ఏడిపించు | ఏడిపించు |
| పిలిపించు | పిలిపించు |
| తెరిపించు | తెరిపించు |
| నేరుపు } | నేరుపు |
| నేర్పించు } | నేర్పించు |
| అమ్మించు | అమ్మించు |
| తప్పించు | తప్పించు |
| కొట్టించు | కొట్టించు |
| చెప్పించు | చెప్పించు |
| ఆడించు | ఆడించు |
| తెప్పించు | తెప్పించు |
| రప్పించు | రప్పించు |
| పంపించు | పంపించు |

సంస్కృతప్రాతిపదికలకు, ధాతువులకు 'ఇంచు' చేరి తెలుగు క్రియలేర్పడుతాయి [సంతోషించు, ప్రయత్నించు మున్నగునవి]. ఇవి ప్రేరణార్థాలు కావు. అవి స్వార్థమున చేరినాయి.

### అసమాపక క్రియలు — శత్రర్థకం

| గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|
| కొట్టుచు | కొడుతూ |
| పాడుచు | పాడుతూ |
| పోవుచు | పోతూ |
| చేయుచు | చేస్తూ |
| ఇచ్చుచు | ఇస్తూ |
| అనుచు | అంటూ |

వ్యావహారికంలో వ్యతిరేకార్థంలో "ఆయన వినకుండా వెళ్ళాడు" లాంటి ప్రయోగాలు కనిపిస్తాయి.

### చేదర్థకం

| | |
|---|---|
| వచ్చిన | వస్తే |
| చేసిన | చేస్తే |
| అయిన | అయితే |
| పోయిన | పోతే |
| వినిన | వింటే |
| వచ్చినను | వచ్చినా |
| చేసినను | చేసినా |

| గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|
| అయినను | అయినా |
| పోయినను | పోయినా |
| వినినను } | వినినా |
| విన్న } | విన్నా |

## క్రియాజన్య విశేషణాలు

### వర్తమానార్థకాలు

| | |
|---|---|
| చేయుచున్న | చేస్తున్న |
| కొట్టుచున్న | కొడుతున్న |
| ఇచ్చుచున్న | ఇస్తున్న |
| తినుచున్న | తింటున్న |
| పోవుచున్న | పోతున్న |

### భూతార్థకాలు

[గ్రాంథిక వ్యావహారిక రూపాల్లో స్వల్పమైన తేడాలు కలవు]

| | |
|---|---|
| వచ్చిన | వచ్చిన |
| వినిన | విన్న |
| కొనిన | కొన్న |

### భవిష్యదర్థకాలు

[గ్రాంథిక వ్యావహారికాల్లో పెద్దగా తేడాలు లేవు]

వ్యతిరేకార్థంలో 'చెప్పని, వినని' వంటి క్రియాజన్య విశేషణాలు అన్నికాలాల్లోనూ ఏకరూపాన్ని కలిగిఉంటాయి.

## తద్ధర్మార్థకాలు

| | |
|---|---|
| [గ్రాంథి] కొట్టువాడు | [వ్యా] కొట్టేవాడు |
| కొట్టెడివాడు | కొట్టేటివాడు |
| వచ్చువాడు | వచ్చేవాడు |
| వచ్చెడివాడు | వచ్చేటివాడు |
| అనువాడు | అనేవాడు |
| అనెడువాడు | అనేటివాడు |

## భావార్థకం

[భావార్థకక్రియ నామవాచకం లాంటిది. దీనికి విభక్తి ప్రత్యయాలను చేర్చవచ్చును]

| | |
|---|---|
| చేయుట | చేయడం |
| కొట్టుట | కొట్టడం |
| తినుట | తినడం |
| వచ్చుట | రావడం |
| తెచ్చుట | తేవడం |
| ఇచ్చుట | ఇవ్వడం |
| చదువుట | చదవడం |

## సంయుక్త క్రియలు

[ సంయుక్త క్రియ అంటే రెండు, మూడు క్రియల కలయిక. సంయుక్తక్రియల్లో మొదటి క్రియయొక్క అర్థమే ప్రథానం. సహాయక్రియ మూలక్రియార్థంలో కొంత విశేషాన్ని సూచిస్తుంది.]

| గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|
| కొట్టివేసెను | కొట్టేశాడు, కొట్టేసింది |
| చేసివేసెను | చేసేశాడు, చేసేసింది |
| చేయవలెను | చేయాలి |
| కొట్టవలెను | కొట్టాలి |
| బోధింపవలెను | బోధించాలి |
| తినవచ్చు | తినవచ్చు; తినొచ్చు |
| జరుగవచ్చు | జరుగవచ్చు; జరగొచ్చు |
| రాకూడదు | రాకూడదు |
| కొట్టవచ్చు | కొట్టకపోవచ్చు |
| చెప్పవలసినది | చెప్పాలసింది |
| కొట్టబోయినాడు | కొట్టబోయాడు |
| కొట్టబోలేదు | కొట్టబోలేదు |

## అ వ్య యా లు

[లింగ, వచన విభక్త్యాదులచే మార్పు చెందని పదాలు—(వ్యయం=కర్చు) కర్చులేనిది—అవ్యయం]

| | |
|---|---|
| కూడ | కూడా |
| చాల | చాలా |
| ఎంతయు | ఎంతో |
| అంత | అంతా |
| ఇంక | ఇంకా |
| దాక | దాకా |

## అవధారణార్థం (Emphatic particle)

| గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|
| వాడేయా | వాడేనా |
| వీడేయా | వీడేనా |
| ఇదా (ఇదియా) | ఇదేనా |
| ఇద్దరు | ఇద్దరూ |

## సముచ్చయార్థం

| | |
|---|---|
| ఇద్దరును | ఇద్దరున్నూ |
| వాడును నేనును వచ్చితిమి | వాడునూ నేనున్నూ వచ్చాం |
| దానిని, నిన్నును | దానినిన్నీ, నిన్నున్నూ |
| అదియు | అదిన్నీ, అదీ |
| ఇదియు | ఇదిన్నీ, ఇదీ |
| వాడును, నేనును | వాడూ, నేనూ |
| తల్లియు, తండ్రియు | తల్లీ తండ్రీ |
| అన్నయు తమ్ముడును | అన్నా తమ్ముడూ |
| తలయు తోకయు | తలా తోకా |
| కదలియు కదలక | కదలీ కదలక |
| దూరదేశములలోని నదులు, కొండలు, వృక్షులు మొదలైనవారి స్వరూపము చూపుటలో కవిత చిత్రకళకు తీసిపోవును. | దూరదేశాలలోని నదులూ, కొండలూ, వృక్షులూ మొదలైనవారి స్వరూపము చూపడంలో కవిత చిత్రకళకు తీసిపోతుంది. |

ఈ క్రింది గ్రాంథికవాక్యాలను వ్యావహారికంలో రాయండి.

నీవు కూడ పుస్తకము వ్రాయుచున్నావా ?

నువ్వుకూడా పుస్తకం రాస్తున్నావా ?

వాడు కట్టెలు కొట్టుచున్నాడు.

వాడు కట్టెలు కొడుతున్నాడు.

ఒజ్జలు పాఠము చెప్పుచున్నారు.

ఒజ్జలు పాఠం చెబుతున్నారు.

వాడు కూడ నబద్ధము లాడుట నేర్చుచున్నాడు.

వాడుకూడా అబద్ధాలాడడం నేర్చుకుంటున్నాడు.

ఈ కురుపు చాల నొచ్చుచున్నది.

ఈ కురుపు చాలా నొస్తున్నది.

వాడా దేవాలయములోని చిత్రములను జూచుచున్నాడు.

వాడా దేవాలయంలోని చిత్రాలను చూస్తున్నాడు.

నే నా పని చేసినాను గాని వానికి బుద్ధి రాలేదు.

నేనాపని చేశాను గానీ వాడికి బుద్ధి రాలేదు.

వా డిప్పుడే యింటికి వచ్చినాడు.

వాడిప్పుడే ఇంటికి వచ్చాడు.

నేను నిన్ననే బందరునుండి వచ్చినాను.

నేను నిన్ననే బందరునుంచి వచ్చాను.

రాముడు రావణుని చంపినాడు.

రాముడు రావణుణ్ణి చంపాడు.

నలుడు జూదములో తన రాజ్యము నోడి పోయినాడు.

నలుడు జూదంలో తన రాజ్యాన్ని ఓడిపోయాడు.

నేనీ యూరు వచ్చి నాలుగు నెలలయినది.

నేనీ ఊరు వచ్చి నాలుగు నెలలయింది.

ఈ పుస్తకమును నా కీయగలవా ?

ఈ పుస్తకాన్ని నాకివ్వగలవా?

అడిగిన వెంటనే నీ కీయవలసిన రూపాయలను నేను నీ కీయగలను.

అడిగిన వెంటనే నీకియ్యవలసిన రూపాయలను నేను నీ కివ్వగలను.

వ్రాయునదేమో సరిగా వ్రాయుము.

రాసేదేమో సరిగ్గా రాయి.

చేయుదువా ? చేయవా ? చెప్పునది సరిగా చెప్పు.

చేస్తావా? చెయ్యవా? చెప్పేది సరిగ్గా చెప్పు.

వత్తువా ? రావా ?

వస్తావా? రావా?

తిట్టుదునన్న భయముచేత వాడూరకొనును.

తిడతానన్న భయంచే వాడూరకుంటాడు.

వాడబద్ధపు సాక్ష్యములు చెప్పి బ్రదుకును. వాని సహవాసము చేయకు.

వాడు అబద్ధపు సాక్ష్యాలు చెప్పి బతుకుతాడు. వాడి సావాసం చెయ్యకు.

చేయునదేమో చేయుము.

చేసేదేమో చెయ్యి.

పోయిన పోవును ; వచ్చిన వచ్చును.

పోతేపోతుంది; వస్తేవస్తుంది.

వినిన వినుము ; లేకపోయిన మానుము.

వింటేవిను; లేకపోతేమాను.

కొనిన కొనును ; లేకపోయిన మానును.

కొంటేకొంటాడు; లేకపోతేమానుతాడు.

చేయుదువేని చేయుము.

చేస్తేచెయ్యి.

ఊరకోకపోయిన ఉరిపెట్టుకో.

ఊరుకోకపోతేఉరిపెట్టుకో.

తెత్తువా లేదా ?

తెస్తావా లేదా?

మేము చాల దూరము పోయినాము.

మేము చాలాదూరం పోయాం.

నామాటకు బదులుచెప్పుదువా చెప్పవా ?

నామాటకు బదులుచెబుతావా చెప్పవా?

అయినను చూతము.

అయినాచూద్దాం.

చెప్పినప్రకారము చేయునదే మంచిది.

చెప్పినప్రకారంచేసేది మంచిది.

నా మాట విందువా ?

నామాటవింటావా?

వాడుకూడ నింత ద్రోహము చేయునా ?

వాడుకూడా ఇంతద్రోహంచేస్తాడా?

నేను వానిఇంటికి పోవలయును.

నేనువాడింటికి పోవాలి.

నీవు మాయింటి కిప్పుడే రావలయును.

నీవు మాఇంటి కిప్పుడేరావాలి.

వా డేమనుకొనునో యని నాకు భయముగా నున్నది.

వాడేమనుకుంటాడోఅని నాకు భయంగాఉంది.

వాడు స్వయముగా వండుకొని తినుచున్నాడు.

వాడుస్వయంగా వండుకుని తింటున్నాడు.

నీ పేరు చెప్పుకొని వాడు బ్రదుకును.

నీ పేరుచెప్పుకుని వాడుబతుకుతాడు.

ఏమియు తోచక వాడు తన్నుకొని చచ్చుచున్నాడు.

ఏమీతోచక వాడు తన్నుకుచస్తున్నాడు.

అనుకొనినదానికంటె అధికముగా లాభము వచ్చినది.

అనుకున్నదానికంటే అధికంగా లాభం వచ్చింది.

ఈ పుస్తకము తెచ్చుటకు చాల కష్టమయినది.

ఈపుస్తకం తేవడానికి చాలాకష్టమయింది.

# వ్యావహారిక రచనకు మరికొన్ని సూచనలు

1. కొందరు వ్యాసంలో మొదటి సగం గ్రాంథికంలోనూ, రెండో సగం వ్యావహారికంలోనూ రాస్తున్నారు. అలాగే మొదటి సగం వ్యావహారికంలోనూ, రెండో సగం గ్రాంథికంలోనూ రాస్తున్నారు. మరికొందరు ఒక వాక్యం వ్యావహారికంలోనూ, రెండో వాక్యం గ్రాంథికం లోనూ రాస్తున్నారు. అంతేకాదు, ఒకమాట ఒకమారు వ్యావహారికంలోనూ, అదేమాట మరొకమారు గ్రాంథికంలోనూ రాస్తున్నారు. ఈమోస్తరుగా కలగా పులగం భాష ఎంతో కనపడుతూంది. కొందరు అరసున్నలు, బండి'ర' లులేని సరళ గ్రాంథికభాష రాస్తున్నారు. రాస్తే వ్యావహారికంలో రాయాలి. కాకుంటే గ్రాంథికంలో రాయాలి. కలగాపులగం భాష రాయడం మంచిదికాదు.

2. క్రియలకు "ఇంచు"—పరమయ్యేటప్పుడు 'ప' వర్ణక ఆదేశం గ్రాంథికాంధ్రంలో వస్తుందిగాని వ్యావహారికాంధ్రంలో రాదు.

| గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|
| ప్రయోగింపబడుచున్నది | ప్రయోగించబడుతూంది |
| ఆలోచింపబడుచున్నది | ఆలోచించబడుతూంది |

3. పదారంభంలో రేఫయుక్త సంయుక్తాక్షరం తెలుగు శబ్దాల్లో గ్రాంథికరూపాల్లో ఉంటాయి. వ్యావహారిక రూపాల్లో లేవు.

| గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|
| క్రొత్త | కొత్త |
| ప్రాత | పాత |
| మ్రొక్కు | మొక్కు |
| బ్రదుకు | బతుకు |
| వ్రేలు | వేలు |
| వ్రాసి | రాసి |

రేఫయుక్త సంయుక్తాక్షరాలు పద మధ్యంలో ఉంటాయి.

ఉదా॥ ఎంద్రకాయ, ఉంద్రాళ్లు, తంద్రి.

4. ఈ క్రింది పదాలకు, పదబంధాలకు గ్రాంథిక వ్యావహారిక రూపాలను గుర్తించడం అవసరం.

| గ్రాంథికము | వ్యావహారికం |
|---|---|
| అగుసరికి | అయ్యేసరికి |
| అణచుటకు | అణచడానికి |
| అనుటకు | అనడానికి |
| ఈయవలె | ఇయ్యాలి, ఇవ్వాలి |
| ఉండెనుగద | ఉండేదికదా |
| ఉండెడివి | ఉండేవి |
| వచ్చుట | రావడం |
| వలె | లాగ, లా, మల్లె |

- తత్సమం
- తద్భవం
- దేశ్యం
  - ఆంధ్రదేశ్యం
  - అన్యదేశ్యం
- గ్రామ్యం
  - నింద్యగ్రామ్యం
  - అనింద్యగ్రామ్యం

**తత్సమం**

విభక్తిప్రత్యయాలుమాత్రం మారి తెలుగులో వాడబడే సంస్కృతపదాలు

| సంస్కృతం | తత్సమం |
|---|---|
| రామః | రాముడు |
| విద్యా | విద్య |
| హరిః | హరి |
| ధేనుః | ధేనువు |

**తద్భవం**

వర్ణాగమం, వర్ణలోపం, వర్ణాదేశం మున్నగు వికారాలను విధివిహితంగా పొంది తెలుగులో వ్యవహరించబడే సంస్కృతపదాలు.

| సంస్కృతం | తద్భవం |
|---|---|
| అగ్నిః | అగ్గి |
| ఆకాశః | ఆకసం |
| కుడ్యమ్ | గోడ |
| శృంగారః | సింగారం |
| శ్రీః | సిరి |

**దేశ్యం**

**ఆంధ్రదేశ్యం**

తెలుగు దేశంలో వ్యవహరించ బడే పదాలు

ఊరు, పేరు, ఇల్లు, ముల్లు, కోట, పేట, పేడ, దూడ.

**అన్యదేశ్యం**

ఇతర దేశ భాషా పదాలు తెలుగులో వాడుక పడి కలిసి పోయాయి.

టిక్కెట్టు–కవరు
సినిమా–రైలు
రోడ్డు – బస్సు
శిస్తు–మాగాణి
పెన్సిలు – సైకిలు – పుకారు
కిరాయి – దర్జీ – పట్టా

**గ్రామ్యం**

**నింద్యగ్రామ్యం**

శిష్టవ్యవహారంలో లేని భాష. పామరులు మాట్లాడేది.
[కూకో, జరుగుద్ది, శాన, వత్తాది, తెత్తా, ఆళ్ళు (వాళ్ళు), ఈళ్ళు (వీళ్ళు), ఆడు (వాడు), ఈడు (వీడు)]

**అనింద్యగ్రామ్యం**

శిష్టులు వాడిన గ్రామ్యప్రయోగాలు గ్రాహ్యాలు. [నిజానిజాలు, ఇష్టాయిష్టాలు, అనేకమంది, కాంగ్రెసేతరులు, అయ్ని, పోయ్ని, పిలు, ఎల్తా, కల్త.]

వ్యావహారిక రచనల్లో ఇంగ్లీషు పదాలెక్కువగా ఉంటున్నాయి. ఇంగ్లీషు పదాలెక్కువగా వాడడంవల్ల ముఖ్యమైన నష్టమేమిటంటే, ఇంగ్లీషు చదువుకోనివాళ్ళూ, స్త్రీలూ ఈ రచనలను శ్రద్ధతో చదివి ఆనందించలేరు. అంచేత ఇంగ్లీషు ఎంత తగ్గిస్తే అంత మంచిది. తెలుగుతో కలిసిపోయిన ఇంగ్లీషు మాత్రమే వాడుతూ ఉండాలి. ఇప్పుడిప్పుడు హిందీ పదాలెక్కువగా వాడబడుతున్నాయి.

# సంస్కృతాంధ్ర శబ్దపరిజ్ఞానం

ఏ శబ్దం సంస్కృతమో (తత్సమం) ఏ శబ్దం తెలుగో తెలియడం చాలా ముఖ్యం. లేకుంటే సంస్కృత సంధుల విషయంలోనూ, సమాసపదాల విషయాలోనూ చిక్కులు ఏర్పడతాయి. సంకర సమాసాలను విరివిగాజేసే అవకాశం ఉంది. కాబట్టి ఏశబ్దం సంస్కృతమో, ఏ శబ్దం తెలుగో తెలియడానికి కొన్ని గురుతులు చెప్పబడుతున్నాయి.

(1) ఋ, ౠ, ఌ, ౡ, ఖ, ఘ, ఙ, ఛ, ఝ, ఞ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ, శ, ష, ః — ఈ అక్షరాలు కేవలం సంస్కృత భాషకు చెందుతున్నాయి. వీటిలో ఏ అక్షరాన్నో, అక్షరాల్నో గలిగిన పదాలన్నీ సాంస్కృతికాలు. అంటే తత్సమ పదాలు.

ఉ॥ ఋతువు; నైఋతి; క్లిష్టం; దుఃఖం; ముఖం, దీర్ఘం; నిర్ఝరం; వాఙ్మయం; రథం; గూఢం; భారం; శరం.

(2) ఎ, ఒ—అనేవి గల పదాలన్నీ తెలుగు పదాలు. సంస్కృతంలో ఎ, ఒ—లు లేవు.

ఉ॥ ఎక్కడ; మేకం; మొన; ఒంటె—మున్నగునవి.

(3) క, చ, ట, త, ప, గ, జ, డ, ద, బ—అనేవి కాక తక్కిన హల్లులకు స్థిరాలని పేరు. తెలుగు మాటల్లో పరుష సరళాలకు ముందే పూర్ణానుస్వారం వస్తూంది. కాబట్టి స్థిరా

క్షరాలకు పూర్వం పూర్ణానుస్వారంగల మాటలన్నీ సంస్కృత శబ్దాలే.

ఉ॥ హింస, సంసారం; సింహం, సంయమి; ప్రియంవద.

(4) సంయుక్తమంటే హల్లుక్రింద మరోహల్లుఉండడం.

ఉ॥ క్య, స్మ, ష్ణ, భ్రి, జ్యా, క్త, స్థ, ర్ణ, మ్న, ల్చ.

ద్విత్వమంటే ఒక హల్లు క్రింద అదే హల్లు ఉండడం.

ఉ॥ క్క; గ్గ, చ్చ, జ్జ, ట్ట, త్త, య్య, ప్ప, మ్మ.

సంస్కృత భాషలో సంయుక్తాక్షరాలు ఎక్కువ. రేఫయుక్త సంయుక్తాక్షరాలు తప్ప తెలుగులో ద్విత్వం కంటే భిన్నమైన సంయుక్తాక్షరాలు లేవు కాబట్టి ద్విత్వాలు కాని సంయుక్తాక్షరాలుగల పదాలన్నీ సాంస్కృతికాలే.

ఉ॥ తీవ్రం; క్రౌర్యం; ఆత్మ; అర్కుడు; ఉత్కలం; దుర్గం; చర్చ; గర్జ; చూర్ణం; అష్టుడు; స్నాయువు; మత్సరం; ఆమ్లం.

రెంటికి మించి హల్లులు సంయుక్తాలైనవి తప్పక సాంస్కృతికాలవుతాయి.

ఉ॥ మత్స్యం; త్ర్యంబకుడు; హార్మ్యం; స్త్రీ; స్వాతంత్ర్యం మున్నగునవి.

**అపవాదాలు :**

---

(a) రేఫయుక్త సంయుక్తాక్షరాలు తెలుగులో కలవు.

ఉ॥ ఎంద్రకాయ; ఉండ్రాళ్ళు, తండ్రి, చక్రం, చట్రం

(b) సంధివల్ల తెలుగులో ద్విత్వాలు కాని సంయుక్తాక్షరాలు వస్తుంటాయి.

ఉ॥ కల్లు, మాన్పడు, ఏర్పడు, మార్చు, జాగ్రత్త, వస్తాడు, మాన్పించు.

(c) తద్భవాలలో ద్విత్వేతరాలైన సంయుక్తాక్షరాలు కొన్ని కనిపిస్తాయి.

ఉ॥ అక్షింతలు ; ఆర్భాటం ; అంతస్తు; నేస్తం ; గేస్తుడు ; జోస్యుడు ; వ్యాజ్యము ; శిస్తు ; రాట్నము ; పెండ్లము.

(5) ప్ర, పరా, అప, అవ, సం, అను, నిర్, దుర్, ఆ, అధి, అపి, వి, ని, అతి, సు, అభి, ఉప, పరి, ప్రతి, ఉత్ — అనే ఈ ఇరవై ఉపసర్గలనబడుతాయి. ఈ ఉపసర్గలతో గూడిన పదాలు సంస్కృత శబ్దాలు.

ఉ॥ ప్రాప్తి, ప్రతివీరుడు, అతిశయం, అధికారం, అభినవం, అనుకరించడం, సంకలనం, వికారం, నిర్దయ, ఉపకారం, దుర్దశ—మున్నగునవి.

(6) ఆ, ఈ, ఏ, నేను, నా, నీ మొదలగు సర్వనామ శబ్దాలు; వీటివల్ల పుట్టిన అక్కడ, ఎక్కడలాంటి శబ్దాలు; ఒకటి, రెండు, మూడు— మొదలగు సంఖ్యావాచక శబ్దాలన్నీ తెలుగులే.

(7) ప్రథమావిభక్తి ప్రత్యయాలైన 'డు, వు' తీసివేస్తే గూడా అర్థమిచ్చే పదాలు సాంస్కృతికాలు.

ఉ॥ గోవింద, రామ, శంభు, తరు మొదలగునవి. వీటిని ప్రాతిపదికలంటారు. వీనికర్థం కలదు.

అతడు, ఆవు — మొదలగునవి ప్రథమాంతాలేఅయినా చివరి అక్షరాలను తీసివేస్తే అర్థముండదు. కాబట్టి ఇలాంటివి తెలుగులని తెలుసుకోవాలి.

(8) దీర్ఘసమాసాలు కలవి సాంస్కృతికాలు.

ఉ॥ నీరాకరసుతాసమేతుడు.

**N.B :** ఆరక్షరాలకంటే ఎక్కువైన తెలుగు సమాసం ఉండదు.

(9) ప్రేరణలేకుండా ధాతువును ఉచ్చరించేప్పుడు 'ఇంచు'గాగమం కలది సంస్కృతశబ్దం.

ఉ॥ హరించు, జయించు, భోగించు, పూరించు

**N.B :** ప్రేరణార్థంలో 'ఇంచు'గాగమంకలవి తెలుగుశబ్దాలు.
ఉ॥ వండించు, తిట్టించు.

**అపవాదం :**

తెలుగుశబ్దాల్లోగూడా ప్రేరణలేకుండా 'అంగ'లాదులకు 'ఇంచు'గాగమం అవుతుంది.

ఉ॥ గాలించు, ఆవులించు
ఉగ్గడించు; ఒప్పించు
తిలకించు, ఆరగించు

# నేటి తెలుగులో సంధి స్వరూపం

నేటి తెలుగు కేవలం సాహిత్యప్రయోజనానికి పరిమితమైంది కాదు. వివిధ శాస్త్రాలను వివరించే ప్రయోజనాన్ని ఆశించేది. భౌతిక, రసాయనిక, జంతు, వృక్షాది శాస్త్రాలను, వైద్య సాంకేతికాది అనేక విషయాలను తెలుగు భాషలో వివరించేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇలాంటి తెలుగు భాషలో సంధిస్వరూపం ఎలా ఉంటుందో పరిశీలిద్దాం.

రెండు అక్షరాలకు మధ్య అత్యంత సన్నికర్షం **(contact)** ఉంటే కల్గే మార్పులను సంధి కార్యం అంటారు. ఈ సన్నికర్షాన్ని సంహిత అంటారు. మరో విధంగా చెప్పాలంటే రెండు అక్షరాలకు మధ్య అర్ధమాత్రాకాలవ్యవధానం ఉంటే 'సంహిత' అంటారు. రెప్పపాటు కాలాన్ని 'మాత్ర' అంటారు. అందులో సగం అర్ధమాత్రాకాల వ్యవధానం అవుతుంది. అంతకన్నా ఎక్కువ వ్యవధానం ఉంటే సంహిత కాదు. సంహితలో—అంటే రెండు అక్షరాలకు మధ్య అర్ధమాత్రాకాల వ్యవధానం—ఉన్నప్పుడు మాత్రం సంధి జరుగుతుంది. అసంహితలో సంధికార్యం నిషిద్ధం. సంహిత, సంధి – అనే పదాలను పర్యాయపదాలుగా కూడా ప్రయోగిస్తారు.

అయితే రెండు అక్షరాలకు మధ్య సంహిత—అంటే సంధి ఏర్పడే పట్టులను గూర్చి సంస్కృత వైయాకరణులు

ఈ విధంగా నిర్వచించారు.

'సంహితైక పదేనిత్యా । నిత్యాధాతూప సర్గయోః ।
నిత్యా సమాసే । వాక్యేతు సా వివక్షామపేక్షతే ।

పై విధి సంస్కృత భాషకు సంబంధించిందైనా, తెలుగు భాషకు కూడా చాలా వరకు వర్తిస్తుంది. కాబట్టి సూత్ర వివరణలో ఉదాహరణలను తెలుగునుంచే ఉటంకిస్తాను.

సంహితైక పదే నిత్యా ।

ఏక పదంలో అక్షరాలకు మధ్య సంహిత ఉంటుంది. కాబట్టి సంధి నిత్యంగా జరుగుతుంది.

పుట్టి+ఎడు=పుట్టెడు    మూడు+అవ=మూడవ
నిర్జి+ఇంచు=నిర్జించు    నిర్ణయ+ఇంచు=నిర్ణయించు
గోరు+అంత=గోరంత

నిత్యాధాతూప సర్గయోః ।

సాధారణంగా తెలుగు ధాతువులన్నీ 'ఉ' అనే అచ్చుతో అంతమవుతాయి. కాబట్టి ధాతువులకు క్రియా ప్రత్యయాలు చేరేటప్పుడు ఆ ప్రత్యయాలు అచ్చులను ఆదిలో కలిగి ఉంటే ఉత్వసంధికి సంబంధించిన ప్రక్రియ జరుగుతుంది. పూర్వ పరాచ్చులు రెండింటి స్థానంలో పరాచ్చు ఆదేశంగా వస్తుంది.

ఇచ్చు+ఎను=ఇచ్చెను
కొట్టు+ఎను=కొట్టెను

చదువుతు+ఉన్నాను=చదువుతున్నాను

కొట్టు+ఇంచు=కొట్టించు

చేయు+ఇంచు=చేయించు

చదువు+ఇంచు=చదివించు

కొట్టు+అక=కొట్టక

తిట్టు+అక=తిట్టక

ఇక సంస్కృత పదాలతో పాటు ఉపసర్గలు కూడా తెలుగు లోకి వచ్చాయి. కాబట్టి తత్సమ పదాల్లో సంస్కృతంలో లాగే ఉపసర్గలను శబ్దాలకు చేర్చేప్పుడు సంధి కార్యం నిత్యంగా జరుగుతుంది.

ప్రతి+ఏక=ప్రత్యేక　　అభి+ఉదయం=అభ్యుదయం

సు+ఆగతము=స్వాగతము　　అను+ఏషణ=అన్వేషణ

నిత్యా సమాసే।

సమాసమందలి పదాల మధ్య సంధి నిత్యంగా జరుగుతుంది.

చింత+ఆకు=చింతాకు;　　ఇల్లు+ఆలు=ఇల్లాలు ;

పీత+అంబరుడు=పీతాంబరుడు; రామ+ఆజ్ఞ=రామాజ్ఞ ;

సూర్య+ఉదయం=సూర్యోదయం.

వాక్యేతు సావివక్షామపేక్షతే।

రచయిత తన ఇష్టాన్ని అనుసరించి వాక్య మధ్యంలో పదాలను విడివిడిగా వ్రాసుకోవచ్చు. లేకుంటే పదాలకు

మధ్య సంధి నియమాలను పాటించనూవచ్చు.

ఉదాహరణకి ఈ క్రింది వాక్యాన్ని చూడండి.

ఒకడు పరీక్షలో ఉత్తీర్ణుడు అయినాడు అనుకొందాం—

ఈ వాక్యంలోని పదాలకు మధ్య సంధి చేస్తే ఇలా ఉంటుంది : ఒకడు బరీక్షలో నుత్తీర్ణుడయినాడను గొందాం.

పై వివరణ వల్ల తేలిందేమంటే వాక్య మధ్యంలో రెండు పదాలను కలిపి సన్నిహితంగా ఉచ్చరించడంగాని, రెండు శబ్దాలమధ్య కొంచెం కాలం ఆగి ఉచ్చరించడంగాని రచయిత ఇష్టంపై ఆధారపడి ఉంటుంది. సన్నిహితంగా ఉచ్చరిస్తే సంధి కార్యం జరుగుతుంది. పదాలను వ్యవధానంగా ఉచ్చరిస్తే సంధి రాదు. కాని వాక్యమధ్యంలో పదాలను విడివిడిగా వ్రాయడంవల్ల చాలా ఉపయోగం ఉంది. అది ఏమిటో వివరిస్తాను.

ఇంగ్లీషు భాషలో 'MIRROR' అనే మాట ఉంది. దీన్ని వాక్యంలో ఎక్కడైనా 'MIRROR' గానే వాడు తున్నాము. కాని తెలుగులో 'అద్దం' అనే మాటను వాక్యారంభంలో 'అద్దం'—అని వ్రాస్తాము. కాని వాక్యమధ్యంలో ప్రతి ప్రకృతికం తర్వాత "నద్దం"—అని వ్రాస్తాము. అల్లాగే సంధిరాని చోట 'య్'ని ఆగమంచేసి'యద్దం'—అని వ్రాస్తాం. సామాన్యపాఠకుడు దీని మూలరూపం ఏదో తెలియక తికమక పడతాడు. కాబట్టి వాక్యమధ్యంలో పదాలను విసంధిగా వ్రాయడం మంచిది. దానివల్ల పాఠకునికి శబ్దం మూాల

రూపం తెలుస్తుంది. ఈ విధంగానే క్రియా శబ్దాల విషయంలో కూడ విసంధిగా వ్రాయడం వల్ల ఎక్కువ ప్రయోజనం చేకూరుతుంది. 'ఉంది'—అనే క్రియా శబ్దాన్ని ద్రుత ప్రకృతికం తర్వాత 'నుంది'—అని, కళలపై సంధి రాని చోట "యుంది"—అని వ్రాయకుండా "ఉంది"— అని వాక్యమధ్యంలో వ్రాయడం సబబు. అల్లాగే 'వ్' ఆగమం చేసి "వుంది"—అని వ్రాస్తే, పాఠకుడు మూలరూపం తెలియక తికమక పడుతాడు. దాని వల్ల క్లిష్టత పెరుగుతుంది. కాబట్టి శబ్దానికి ఏకరూపాన్ని ప్రచారంలోకి తేవడం ఆధునిక ప్రయోజనాల దృష్ట్యా చాలాముఖ్యం.

ఆంధ్ర భాషలోని సమస్త శబ్దాలు కళలని, ద్రుత ప్రకృతికాలని రెండు విధాలుగా ఉంటాయి. కళలంటే అచ్చు అంతమందు గల శబ్దాలు. నకారం అంతమందు గల శబ్దాలను ద్రుతప్రకృతికాలంటారు. పూర్వం వాక్య మధ్యంలో ఈ కళా, ద్రుతప్రకృతికాలను అనుసరించి రెండు పదాలకు మధ్య సంధి చేస్తూ వచ్చారు. కళల్లో అ, ఇ, ఉ- అనే అచ్చులకు మరో అచ్చు పరమయ్యేటప్పుడు కొన్నిచోట్ల సంధి కార్యం జరుగుతుంది. మరికొన్నిచోట్ల సంధికార్యం జరుగదు. అలా సంధి రానిచోట్ల 'య్' ఆగమంగా వస్తుంది. 'అ' అనే అచ్చుకు మరోఅచ్చు పరమైతే సంధి బహుళంగా జరుగుతుంది. 'ఇ'-అనే దానికి సంధి కార్యం వైకల్పికంగా జరుగుతుంది. 'ఉ' అనే దానికి సంధి కార్యం నిత్యంగా జరుగుతుంది. ఈ నియమాలు పదాలకు మధ్య వర్తిస్తాయి. పదం లోని అక్షరాలకు మధ్యకూడా వర్తిస్తాయి. కానీ నేటి

శిష్టవ్యావహారికాంధ్రంలో వాక్య మధ్యంలో పదాలకు నడుమ సంధి నియమం పాటించబడడంలేదు. విజ్ఞాన సర్వస్వ సంపుటాల్లో కూడ వాక్యమధ్యంలో పదాలను అసంధిగానే వ్రాశారు. అచ్చులకు, అచ్చులుగాని, కొన్ని హల్లులుగాని పరమయ్యేటప్పుడు య్, ర్, ట్, మున్నగు ఆగమాలు పదాలకుగాని, అక్షరాలకు మధ్యగాని వస్తాయి. కాని ఈ ఆగమాలనుగూడ ఏకపదంలోని అక్షరాలకు మధ్యనూ, సమాసాల్లోనూ మాత్రం పాటించి, వాక్యంలోని పదాలకు మధ్య మూల రూపంతో వ్రాయడం సౌలభ్య హేతువు అవుతుంది.

మిద్దె+ఇల్లు=మిద్దెటిల్లు
పెంకు+ఇల్లు=పెంకుటిల్లు
మదపు+ఏనుగు=మదపుటేనుగు
దుక్కి+ఎద్దు=దుక్కిటెద్దు
గంగి+ఎద్దు=గంగిరెద్దు
పొద+ఇల్లు=పొదరిల్లు
గుఱ్ఱము+బండి=గుఱ్ఱబ్బండి

కొన్ని శబ్దాల తర్వాత పరుషాలు పరమవుతూ ఉంటే ఆ పరుషాలు గసడదవ - లుగా మారుతాయి. సౌలభ్యదృష్టితో ఈ నియమాన్ని వదిలివేయడం మంచిది. అలా కాకుండా రాకపోకలు, తల్లిదండ్రులు—అని వ్రాస్తే, 'పోక', 'దండ్రి'—మున్నగునవి మూలరూపాలుగా గ్రహించబడే ప్రమాదం ఉంది. 'గడప', 'గల్పిక', 'గనుక'—మున్నగు రూపాలు ఈనాడు వాక్యారంభంలోగూడ కనిపిస్తున్నాయి. కాబట్టి గసడదవాదేశాన్ని వదలివేయడం మంచిదేమో!

ఇక ద్రుత ప్రకృతికాల విషయం చూద్దాం. ద్రుత ప్రకృతికానికి అచ్చు పరమవుతూ ఉంటే ఆ పరాచ్చు పొల్లు నకారంతో చేరి వచ్చున్+ఇపుడు=వచ్చు నిపుడు, ఉండెన్+అతడు=ఉండెనతడు—అనే విధంగా మారుతుంది. కాని ఏక పదంలోనూ, సమాసంలోనూ అక్షరాలకు మధ్య ఈ విధంగా వ్రాయవచ్చు. కాని వాక్య మధ్యంలో పదాలకు మధ్య మూల రూపాలతో వ్రాయడం సబబు. పద్యాల్లో తప్ప నేడు పొల్లు నకారంతో కూడిన ఉచ్చారణ లోపించింది. ద్రుతప్రకృతికాలకు హల్లులు పరమయ్యేటప్పుడు బోలెడంత ప్రక్రియ జరుగుతుందని వైయాకరణులు పూర్వ రూపాలను సాధించారు. కాని మూలరూపంతోనే వ్రాసి నుంటే ఈ గొడవంతా పోతుంది. పూర్వకావ్యాలను చద వుకోవాలనే వారు ఆ సూత్రాలను, ఆ వ్యాకరణాన్ని పఠిస్తారు. పరుషాలను సరళాలుగా మార్చడమో, ద్రుతాన్ని బిందువుగా మార్చడమో నేటి తెలుగులో చాలా అరుదుగా కనిపిస్తుంది. అరసున్న పూర్తిగా లోపించింది. మూల రూపాలతో వ్రాయడంవల్ల సౌలభ్యం ఎక్కువ అవుతుంది

తెలుగులో తత్సమ పదాల్లోనూ, సమాసాల్లోను సంస్కృత పదాలు విశేషంగా కన్పిస్తాయి. వాటిలో సంస్కృత సంధి నియమాలను అనుసరించి సవర్ణదీర్ఘసంధి గుణసంధి, వృద్ధి సంధి, యణాదేశ సంధి, శ్చుత్వసంధి అనునాసిక సంధి, విసర్గసంధి మున్నగునవి అనుసరింప బడుతాయి.

| | | |
|---|---|---|
| దేవాలయం | ఉపేంద్రుడు | పరమౌషధం |
| సేనాధిపతి | మహేశ్వరుడు | శివైక్యము |
| అమృతాంజనం | రామేశ్వరం | ఏకైక |
| కవీంద్రుడు | యథేచ్ఛ | అత్యంతం |
| గిరీశం | సూర్యోదయం | పిత్రార్జితం |
| తపోబలం | పరోపకారం | వాఙ్మయం |
| మనోరథం | సజ్జనులు | జగన్నాథుడు |
| మనస్తాపం | తన్మయులు | దిగ్గజాలు |
| | దిగ్విజయము | |

ఇలా లెక్కలేనన్ని ఉదహరించవచ్చు. వీటిలో ఎక్కువ భాగం సమాసాలు కాబట్టి సంధికార్యం సంస్కృత వ్యాకరణ విధులను అనుసరించి నిత్యంగా జరుగుతాయి. ఇవన్నీ తత్సమ పదాలు.

చింతాకు, చిన్నమ్మ, అమ్మమ్మ, చిన్నక్క, మామిడాకు, కాడెద్దులు, బండెద్దులు, తాటాకు – మున్నగు తెలుగు సమాసాలకు ఈ విధులు వర్తించవు. వీటికి అత్వ, ఇత్వ, ఉత్వ సంధులకు సంబంధించిన విధులు వర్తిస్తాయి.

ఉచ్చారణ సౌలభ్యదృష్టితో రెండు అచ్చులకు నడుమ 'య్', 'వ్'—అనే ఆగమాలు వస్తాయి. కాని వైయాకరణులు ప్రకృతి భావాన్ని—మూలరూపంతో వ్రాయడాన్ని నివారించేందుకు రెండు అచ్చులకు మధ్య 'య్' మాత్రం వస్తుందని వ్రాశారు. మా+ఊరు – అనే పదబంధాన్ని తీసికొందాం. వ్యాకరణాన్ని అనుసరించి దీర్ఘాచ్చుపై సంధి

రాదు. సంధి రానిచోట 'య్' ఆగమంగా వచ్చి 'మాయూరు' అవుతుంది. మాలోని "ఆ" (మ్+ఆ) కంఠం నుండి పలుకబడే ధ్వని. ఊకారం ఓష్ఠంనుండి పలుకబడే ధ్వని. ఇక్కడ 'య్' అనే తాలువునుండి పలుకబడే ధ్వని ఆగమంగావచ్చే అవకాశం లేదు. దంతౌష్ఠ్యమగు 'వ్' ఆగమంగా వచ్చి మావూరు అవుతుంది. పూర్వాక్షర ప్రభావం కాని, ఉత్తరాక్షర ప్రభావంకాని ఇట్టిచోట్ల పని చేస్తుంది. మొత్తం మీద ఉచ్చారణ సౌలభ్యం కొరకు సహకారాక్షరాలుగా 'య్', 'వ్' - అనే ఆగమాలు రెండు అచ్చులకు నడుమ వస్తూ ఉంటాయి. అయితే ఆధునికులు వాక్యమధ్యంలో పదాలను మూలరూపాలతోనే వ్రాస్తున్నారు-అంటే 'మాఊరు' అనే విధంగా వ్రాస్తున్నారు. కొందరి రచనల్లో కొన్ని పట్టుల్లో మాత్రం ఈ 'య్', 'వ్'—ఆగమాలు కొన్నిచోట్ల కన్పిస్తున్నాయి. మొత్తంమీద మూలరూపాలతోనే వాక్యమధ్యంలో పదాలను నేటి రచయితలు వ్రాస్తున్నారు. ప్రామాణికులైన రచయితల రచనలలో నేటి తెలుగులో సంధి స్వరూపాన్ని నిరూపించే వాక్యాలను ఈ క్రింద ఉటంకిస్తాను.

ఉస్మానియా విశ్వ విద్యాలయ భాషాశాస్త్ర ప్రధానాచార్యులు శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తి గారి వ్యాసాలనుండి ఈ వాక్యాలనుచూడండి.

1. 1966లో తెలుగు 'అ'ధికార భాష 'అ'యింది.

2. ప్రభుత్వ వ్యవహారం 'అ'ంతా 'ఇ'కమీదట తెలుగులోనే నడుస్తుంది.

3. తెలుగును గుర్తించటంలో 'ఉ'న్న ముఖ్యమైన 'ఉ'ద్దేశ్యము ప్రజలకు, ప్రభుత్వానికి మధ్య దూరము తగ్గించటమే.

4. వీటిని 'అ'న్నిటిని తెలుగులోకి తర్జుమా చేసి 'ఆ'ధికారిక పాఠాలు తయారు చేయటానికి 1964లో మన ప్రభుత్వం 'ఒ'క 'అ'నువాదక సంఘాన్ని న్యాయశాఖలో విభాగంగా నియమించింది.

5. ఇంతవరకు 'ఈ' సంఘంవారు చేసిన పని, 'ఇ'క ముందు చెయ్యవలసిన పని, 'అ'నువాద విధానంలో 'అ'నుసరించిన సూత్రాలు, 'ఎ'దుర్కొన్న సమస్యలు మొదలగు విషయాలు చర్చించే 'ఒ'క అధికారిక నివేదిక 'ఈ'మధ్య ప్రభుత్వం విడుదల చేసింది. [శ్వేతపత్రంపై విమర్శ—1 నుండి]

అక్కడ శ్వేత జాతి 'అ'ల్ప సంఖ్యాక ప్రభుత్వం ఏ'కపక్షంగా స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొని 'అ'ధిక సంఖ్యాకులైన 'ఆ'ఫ్రికన్లకు 'ఎ'ట్టి హక్కులు లేకుండా చేయడంతో 'అ'ది ప్రపంచ సమస్యే అయింది.

[ఆంధ్ర జ్యోతి సంపాదకీయం నుండి]

ఇలా చెల్లించాలి 'అ'ంటే రాష్ట్ర 'ఆ'ర్థికపరిస్థితి 'అ'ందుకు 'అ'నువుగా లేదు.

[ఆంధ్రపత్రిక సంపాదకీయం నుండి]

కానిపక్షంలో 'అ'దనపు భూమి శిస్తు విషయంలో 'ఎ'దుర్కొన్న చిక్కులసే 'ఈ' ప్రతిపాదన విషయం

లోనూ ప్రభుత్వం 'ఎ'దుర్కొనవలసి వస్తుంది.

[ఆంధ్రప్రభ సంపాదకీయం నుండి]

సెన్సారు బోర్డువారు మితిమీరిన 'ఔ'దార్యంతో వ్యవహరిస్తున్నారని 'ఇ'టీవల పార్లమెంట్‌లో 'ఇ'తరత్రా విమర్శలు వచ్చాయి. [ఆంధ్రభూమి సంపాదకీయం నుండి]

1. విసంధి పద్ధతిని 'అ'వలంబించి అచ్చులను విడదీసి ముద్రించితిమి.
2. ఇందు వ్యావహారికములైన తెలుగు పదములు సరి'అ'గు రూపములతో 'ఈ'యబడినవి.
3. జయాపీడుని 'ఆ'స్థానమున సభాపతి 'ఐ' ఉండెను. ఉదాహరణ శ్లోకములుకాక ఇందు డెబ్బది'ఐ'దు కారికలు ఉన్నవి. [విశ్వసాహితి, విజ్ఞానసర్వస్వము]

ఈ పై ఉదాహరణలవల్ల వాక్య మధ్యంలో పదాలకు 'య్' 'వ్' ఆగమాలను పాటించడంగాని, ద్రుతంతో చేర్చి అచ్చులను వ్రాయడంగాని, పదాలకు మధ్య సంధులను పాటించడంగాని తెలుగు వచన రచనలో క్రమంగా లోపిస్తూ ఉందని తెలుస్తూంది. పోతే 'వ్' ఆగమాన్ని కొందరు రచయితలు కొన్నిచోట్ల విరళంగా ప్రయోగిస్తున్నారు. ప్రకృతి భావంతో అంటే మూలరూపంతో పదాలను వాక్యమధ్యంలో వ్రాయడమే నేడు ప్రచురముగ కన్పిస్తూంది. ఆధునిక అవసరాల దృష్ట్యా అలా వ్రాయడం చాలా ముఖ్యంకూడా.

మన భాషలోనే గాక ద్రావిడభాషాకుటుంబానికి చెందిన తమిళం, కన్నడం మున్నగు భాషల్లోకూడా పదాలను మూల రూపాలతోనే వ్రాస్తున్నారు. ఉదాహరణలు చూడండి.

"అదు ఎదువె న్రాల్, అదు దాన్ అవన్ పేచుమ్ మొళి"

[ప్రఖ్యాత తమిళ రచయిత ఎమ్. వరదరాజన్ గారి "మొళియిన్ కతై" పుస్తకం నుండి]

పై వాక్యంలో క్రిందగీతలు పెట్టిన స్థలాల్లో తెలుగులో లాగే ఉత్వసంధి, హల్లుమీది అచ్చుతో చేరడంవంటి వ్యాకరణ కార్యాలు జరగాలి. కానీ వీటిని ఇలా సౌలభ్యం కోసం విడదీసి మూలరూపాలతో వ్రాయడం జరిగింది. నేటి తెలుగులో 'ఓయ్' అనే సంబోధనరూపంలో మినహా హాలంతాలైన పదాలులేవు.

"ఆది ప్రత్యయమత్తు అంత్య ప్రత్యయ గళపట్టియన్ను అర్థ మత్తు ఉదాహరణె గళ సహిత కొడలాగిదె"

[భారద్వాజ కన్నడ నిఘంటువు మున్నుడి నుండి]

కన్నడంలో ప్రకృతిభావం విపులంగా కన్పిస్తూంది. 'య్' ఆగమం చాలా అరుదుగా వస్తూంది. వారు వాక్య మధ్యంలో పదాలను అచ్చులతో ప్రారంభించే వ్రాస్తుంటారు. 'వ్', 'య్' లాంటి ఆగమాలతో వ్రాయడం, సంధులు చేయడం కన్నడ భాషలో తక్కువగా కన్పిస్తూంది.

ఇంగ్లీషు భాషలో కూడా సంధులు ఉన్నాయి. ఉదాహరణకు ఈ క్రింది వాటిని చూడండి.

It's blue (one syllable)
She's a girl [ ,, ]
Don't talk [ ,, ]

కానీ ఆంగ్ల భాషలో ఉచ్చారణకాలమందు మాత్రం సంధిచేసి పదాలలోని కొన్ని ధ్వనులను లోపింపజేసి, కొన్నిటి ఉచ్చారణలను మార్చి పలుకుతుంటారు. కానీ వ్రాసేప్పుడు పదాలను మూలరూపాలతో వ్రాస్తుంటారు. తెలుగులోకూడా ఆ విధంగా మూలరూపంతో పదాలను వ్రాయడం ఆధునిక ప్రయోజనాల దృష్ట్యా చాలా అవసరం.

# ఉపసర్గలు

తెలుగు శబ్దాలకు ఉపసర్గలు లేవు. తత్సమ శబ్దాలకే ఉపసర్గలు చేరుతాయి. వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయాలచే సంస్కృత శబ్దాలు, ఆంధ్రభాషలో ప్రవేశించాయి. వాటికే తత్సమ శబ్దాలని పేరు. తత్సమ శబ్దాలేవో, తెలుగు శబ్దాలేవో కనుగొనే సంకేతాలు మరో ప్రకరణంలో ఇదివరకే వివరించబడ్డాయి. అనేక సంస్కృత శబ్దాలు ఉపసర్గలతో కూడి ఉంటాయి. వాటిని విభజిస్తే, శబ్దాల యథారూపాలను తెలుసుకోవడానికి అవకాశం కల్గుతుంది. ఉపసర్గలు శబ్దాలకు పూర్వమందు ప్రయోగించబడుతాయి. ఇలాంటి వాటిని ఆంగ్లంలో **prefixes** అంటారు. శబ్దాల చివర చేరే వాటిని [ప్రత్యయాలు] **suffixes** అంటారు. ఉదాహరణకి విభక్తి ప్రత్యయాలు, క్రియాప్రత్యయాలు మున్నగువాటిని పేర్కొనవచ్చును.

ఈ ఉపసర్గలు శబ్దాలకు కొన్నిచోట్ల ఉత్కృష్టార్థాన్ని గల్గిస్తాయి. మరికొన్నిచోట్ల అపకర్షాన్ని గల్గిస్తాయి. కొన్నిచోట్ల వ్యతిరేకార్థాన్ని కూడా గల్గిస్తాయి. ఈ ఉపసర్గలు [ప్రాదులు] షుమారు 23 ఉన్నాయి. ప్ర, పరి, అభి, సం, ఉత్, ప్రతి, పరా, అప, అను, అవ, నిర్, నిస్, దుర్, దుస్, అధి, ఉప, అతి, ని, సు, వి, ఆ, అ, అపి—అనునవి.

1. ప్ర=గొప్ప, మిక్కిలి, శ్రేష్ఠము
ప్రదేశము, ప్రకంపము

2. పరి=మిక్కిలి, యోగ్యమైన
పరిజనము, పరితాపము

3. అభి=యోగ్యమైన, మేలైన
అభివందనము, అభ్యుదయము

4. సం=ఒప్పిదమైన, యోగ్యమైన, మేలైన
సందర్శనము, సంరక్షణము

5. ఉత్=మిక్కిలి, ఎత్తైన
ఉద్ఘాటించు, ఉన్నతము

6. ప్రతి=బదులు, వేఱు
ప్రతికూలము, ప్రతిదినము, ప్రతిపాలనము

7. పరా, అప=వ్యతిరేకార్థము
పరాజయము, అపజయము

8. అను=పిమ్మట, దగ్గఱ, మిక్కిలి
అనువాదము, అనురక్తి

9. అవ=క్రింద, బాగుగ
అవతరణము, అవలోకనము

10. నిర్, నిస్=పూర్తి, వ్యతిరేకము
నిర్గమించు, నిష్కామము, నిష్ప్రయోజనము

11. దుర్, దుస్=చెడు, వ్యతిరేకము
దుర్గమము, దుస్సాధ్యము, దుర్దినము

12. అధి=మీద, అధికము

అధివసించు, అధిపాదము

13. ఉప=సమీపము, బాగు

ఉపశమించు, ఉపనది, ఉపాసీనుడు

14. అతి=ఎక్కువ, దాటు (గడచు)

అతిమధురము, అతిక్రమము

15. ని=అధికము, హీనము (లేని)

నిరూపణ, నికృష్టము, నిశితము

16. సు=మంచి, బాగు, మిక్కిలి

సుకర్మము, సులభము, సుగుణము, సుకుమారము.

17. వి=అధికము (విశేషము) పోయినది (విగతము)

విజ్ఞానము, వియోగము, వ్యర్థము, విధవ.

18. ఆఙ్=దనుక, నుండి ... వరకు

ఆమరణాంతము, ఆసేతుహిమాచలము, ఆమూలాగ్రము

19. అ=వ్యతిరేకము, లేనిది, చెడు

అజ్ఞానము, అన్యాయము, అధర్మము, అమూల్యము, అకార్యము.

20. అప=విపరీతము

అపార్థము, అపనమ్మిక, అపనెపము

21. అపి

అపినద్ధము

22. స=తో, కూడ, సహ

సాభిలాషము, సాభిప్రాయము

23. స్వ=స్వంతము

స్వాభిప్రాయము, స్వవిద్య

## ! రాగ చిహ్నం (exclamation)

ఆశ్చర్యం, సంతాపం, ప్రశంస, సంబోధన మొదలగు వాటిని తెలిపే పదాల చివర, వాక్యాల చివర ఈ గుర్తు వస్తుంది.

ఉదా ॥ ఆ ! ఇవి ఏమిటి మాటలు ! అయ్యో !

## " " అనువాద చిహ్నం (inverted commas)

ఇతర గ్రంథాలనుండి గ్రహించబడిన వాక్యాలు, పదాలు మున్నగువాటి కిరుప్రక్కల ఈ గుర్తులు వాడుతారు. ఒకరు చెప్పిన దానిని అలాగే మళ్ళీ చెప్పడానికి కూడా ఈ గుర్తుల్ని ఉపయోగిస్తారు.

ఉదా ॥ "దుర్బలస్య బలంరాజా" అన వినమే.

## ( ) వృత్తార్థం [ ] వలయితం (brackets)

ఈ రెండు గుర్తులు అముఖ్యములైన పదాలయొక్క గాని వాక్యాలయొక్కగాని రెండుప్రక్కల ఉపయోగిస్తారు. పర్యాయపదాల రెండుప్రక్కలకూడా వీటిని ఉంచుతారు. ఒక విషయాన్ని విశదంగా తెలియజేసేందుకు ఈ కుండలీకరణాలు ఉపయోగ పడుతాయి.

ఉదా ॥ దాశరథికి (రామునకు) నమస్కారం. నిష్కారణంగా నీచుడు (పాపభీతి లేనివాడు గనుక) సత్పురుషులకు కీడుచేస్తాడు.

λ హంసపాదం

ఈ గుర్తు లుప్తవర్ణాదులు, పొరబాటున మరచిన అక్షరాలు 'మీాద వ్రాయబడి ఉన్న'వని తెలుపుతుంది.

పొరపాటుకు
ఉదా॥ నేను వెళ్తున్నాను.
λ

* తారకం
† శూలం

ఈ గుర్తులు గ్రంథమందలి విషయాల్ని గూర్చి అడుగున వ్రాయబడిన విశేషార్థములు మొదలగు వాటిని చూడుమని పాఠకునికి తెలుపడానికి ఉపయోగిస్తారు.

# జాతీయాలు (IDIOMS)

శబ్దమునకున్న అర్థంలోగాక వేరొక అర్థంలో అనేకులచే చిరకాలం నుండి ఇవి వాడబడుతుంటాయి. ఇవి ప్రయోగరూఢిచే ఏర్పడిన పదజాలం. వాక్యరచనలో జిగిని, బిగిని కలిగించడానికి జాతీయ పదప్రయోగం అవసరం. జాతీయాలను సేకరించడంతోబాటు వాటిని వాక్యాల్లో ప్రయోగించడం అలవాటు చేసుకోవాలి. అప్పుడు భాషకెంతో అందం చేకూరుతుంది. ఈ విషయంలో ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీవారి "పదబంధ పారిజాతం" లాంటి గ్రంథాల్ని పరిశీలించడం ఎంతైనా అవసరం. ఈ క్రింద మచ్చునకు కొన్ని జాతీయాలూ వాటి అర్థాలూ పేర్కొనబడ్డాయి.

అట్టుడికినట్లుడకడం = భయపడడం

అంకురార్పణ జేయడం = ప్రారంభ మొనర్చడం

అందె వేసిన చేయి = నేర్పరి

ఆరుమూడవడం = చెడిపోవడం

ఆబాలగోపాలం = పిన్నలు పెద్దలు

ఇంగువగట్టిన గుడ్డ = పూర్వగుణాలు గల్గిఉండడం

ఉవ్విళ్ళూరడం = మిక్కిలి ఉత్సాహపడడం

ఉక్కుతునకలు = బలశాలురు

ఎంతచెట్టుకంతగాలి = తనకున్న దానికన్న ఎక్కువ లభించదు

ఏనుగుపాడి = సమృద్ధి

ఒడిగట్టడం = సిద్ధపడడం

కాలుగాలినపిల్లి = నిలకడలేని జీవి

కత్తిమీదిసాము = కష్టమైన పని

కండ్లు కాయలు కాయడం=రాకకై నిరీక్షించడం

కారాలు, మిరియాలు నూరడం=కోపగించడం

కోటికి పడగెత్తడం=మిక్కిలి కలిగిఉండడం

గంగలో కలవడం=వ్యర్థమవడం

గొంతెమ్మ కోర్కెలు=అలభ్యమైన కోర్కెలు

గోరంతలు కొండంతలు చేయడం=ఎక్కువగా వర్ణించడం

చర్విత చర్వణం=చేసిందే మరల చేయడం

చెవులుబట్టి ఆడించడం=తక్కువ చేయడం

చేదోడు వాదోడు=సహాయం

తలదాల్చడం=గౌరవించడం

తామరతంపర=సమృద్ధి

తేనెపూసిన కత్తి=పైకి నెమ్మదిగా కన్పిస్తూ లోన క్రౌర్యం కలవాడు

తోడునీడ=సహాయం

నడమంత్రపుసిరి=మధ్యకాలంలో వచ్చిన ఐశ్వర్యం

నేత్రపర్వం=ఆనందం కూర్చడం

నోళ్ళుకట్టడం=మాట్లాడకుండ చేయడం

పట్టిందల్లా బంగారం=అనుకొన్న పనులు నెరవేరడం

పుక్కిటి పురాణం=నిరుపయోగవచనం

పూసగ్రుచ్చినరీతి=వివరంగా

పాతచింతకాయపచ్చడి=పనికిరానిది

బూడిదలోపోసినపన్నీరు=వ్యర్థమైంది

మచ్చుమందు చల్లడం=లోబరుచుకోవడం.

మీనమేషాలు లెక్కించడం=కార్యాచరణకు పూనుకొనకపోవడం

ముద్దులు మూటగట్టు=అందముగఉండు

మూగనోము పట్టడం=ఊరకుండు

ముసలం పట్టడం=నాశనం కల్గడం

రాద్ధాంతసిద్ధాంతాలు=నిర్ణయం

రొట్టెవిరిగి నేతిలోపడడం=కార్యమనుకూలమగు

వెన్నతో=చిన్నప్పటినుండి

వెన్నెముక వంటి వారు=ఆధారభూతులు

సింహస్వప్నం=భయకారణం

సిగపట్లు=తగాదాపడడం

సుగ్రీవాజ్ఞ=దృఢమైన శాసనం

## జాతీయాలను వాక్యాలతో ప్రయోగించడం

(1) పుక్కిటి పురాణం
ఎన్నికల సమయంలో రాజకీయ నాయకులు పుక్కిటి పురాణాలు చెబుతారు.

(2) వెన్నెముక వంటివాడు
భారత దేశానికి రైతు వెన్నెముక వంటివాడు.

(3) అట్టుడికినట్లుడకడం
బాంగ్లాదేశ యుద్ధకాలంలో పాక్ సైన్యాలట్టుడికి నట్లుడికిపోయారు.

(4) ఇంగువకట్టినగుడ్డ
తెలుగువారి మేధాసంపత్తి ఇంగువకట్టిన గుడ్డలాంటిది.

(5) ఆబాలగోపాలం
ఆబాలగోపాలం పాటుపడితేగాని దేశాభ్యుదయం సాధ్యంకాదు.

ఈ విధంగా రచనలో ప్రయోగించడం అలవరచుకొని రచనా పాటవం అభివృద్ధి కావించుకోవాలి.

# సామెతలు (PROVERBS)

సామెతలు రచనకూ ప్రసంగానికీ దీపాలు. సామెతలో ధ్వని ఉంటుంది. సమయోచితంగా ఒక సామెతను ప్రయోగిస్తే పాలలో పంచదార కలిపినట్లే. సామెతలు చిన్న చిన్న వాక్యాలుగా ఉంటాయి. చెవికింపుగా ఉండి మన పూర్వుల అనుభవాల్ని తెలియచేసే అమృత గుళికలు సామెతలు. సూటిగా చెప్పాలనుకున్న విషయ వివరణకు సహాయకారి సామెత. ప్రయోగరూఢి ననుసరించి వేరొక అర్థంలో వాడబడేది జాతీయం. పదిమంది జీవితానుభవాల సమీకరణమే సామెత. ఇవి నీతిని, హాస్యాన్ని, ఆనందాన్ని అందిస్తాయి. అభిప్రాయ వ్యక్తీకరణాన్ని వక్రగతినుండి కాపాడడానికి సామెతలు సహాయ పడుతాయి. ఇట్టి సామెతల్ని సేకరించి రచనలలో ఎక్కువగా ఉపయోగించుకోవడం అలవరచుకోవాలి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీవారు సామెతల సంకలనాల్ని ప్రచురించారు. వాటిని పరిశీలించడం కూడా అవసరం. మచ్చుకు కొన్ని సామెతలు క్రింద ఉటకించబడుతాయి.

అభ్యాసం కూసువిద్య

అమ్మ తాను పెట్టదు తెచ్చుకు తిననివ్వదు

అరచేతిలో వైకుంఠం చూపుతాడు

ఆకలి ఆకలి అత్తగారూ అంటే రోకలి మింగవే కోడలా అన్నదట

ఆలూ లేదు, చూలూ లేదు కొడుకు పేరు సోమలింగం

ఇంటి పేరు కస్తూరివారు ఇంట్లో గబ్బిలాలకంపు

ఇంటి చక్కదనం ఇల్లాలు చెబుతుంది

ఈత క్రింద పాలు త్రాగినా కల్లే అంటారు

ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికెక్కునా

ఊరిమీద నూరుపడ్డా కరణంమీద కాసుపడదు

ఎక్కడున్నావే కంబళీఅంటే వేసినచోటనేఉన్నా వెంబళీ అన్నదట

ఎలుకకు పిల్లి సాక్ష్యం

ఏపాటుతప్పినా సాపాటు తప్పదు

ఏ పుట్టలో ఏ పాముందో

ఏయెండ కాగొడుగు

ఒకపూట తినేవాడు యోగి, రెండు పూటలా తినేవాడు భోగి,
మూడు పూటలా తినేవాడు రోగి

ఒకచెయ్యి తట్టితే చప్పుడవుతుందా ?

కష్టసుఖాలు కావడికుండలు

కాలికివేస్తే మెడకు మెడకువేస్తే కాలికి

కుక్క కాటుకు చెప్పుదెబ్బ

కొండ త్రవ్వి ఎలుకను పట్టినట్లు

కొబ్బరిచెట్టు ఎందుకు ఎక్కావురాఅంటే దూడ గడ్డికోసం

కోతి పుండు బ్రహ్మరాక్షసి

గుండ్రాయిదాస్తే పెళ్ళి ఆగుతుందా

చింతచచ్చినా పులుపు చావదు

చెప్పుడుమాటలకన్నా తప్పుడుమాటలునయం

జోగీజోగీ రాచుకుంటే బూడిద రాలినట్లు

తనదాకావస్తేగాని తలనొప్పి బాధ తెలియదు

తాళ్ళపాకవారి కవిత్వం కొంత, తన పైత్యం కొంత
దినదినగండం వెయ్యేళ్ళు ఆయుస్సు
నిమ్మకు నీరెత్తినట్లు
పిడుక్కూ బియ్యానికి ఒకటే మంత్రం
పులినిచూచి నక్క వాత పెట్టుకున్నట్లు
బూడిదలో పోసినపన్నీరు
మంత్రాలకు మామిడికాయలు రాలవు
ముసుగులో గుద్దులాట
విస్సన్న చెప్పింది వేదం
శంఖంలో పోస్తేగాని తీర్థంగాదు
సైంధవుడడ్డపడ్డట్లు
హనుమంతునెదుట కుప్పిగంతులా !

# మాండలికాలు

తెలుగు దేశంలో భౌగోళికంగా మూడు ప్రధాన భాగాలు కనిపిస్తాయి—సాగరసీమ, రాయలసీమ, తెలంగాణము—అనేవి. పై ప్రాంతాల్లో ఒక్కొక్క దానిలోను కులాలనుబట్టి, వృత్తులనుబట్టి, వ్యవహర్తల ఆర్థిక విద్యా సంస్కార స్థితులనుబట్టి ఎన్నో మాండలిక ప్రత్యేకతలను గల్గిన శబ్దాలు కనిపిస్తాయి. పరభాషా సంపర్కంవల్ల మరి కొంత విలక్షణతను గల్గిన శబ్దాలు కూడా ఉన్నాయి. సంస్కారవంతులైన నాగరికుల(శిష్టుల) వాడుకలో స్థూలంగా దేశమంతటా సమరూపత కనిపిస్తుంది. రాకపోకలు, వార్తా పత్రికలు, ఆకాశవాణి మొదలైనవి ఈ సమరూపతను మరింత వ్యాప్తిలోకి తెచ్చాయి. అయినా ఆయా ప్రాంతాల్లో ప్రత్యేకతను సంతరించుకొని తెలుగుభాషకు వన్నెలు చిన్నెలు కూరుస్తున్న కొన్ని మాండలికాల్ని గూర్చి తెలుసుకోవాలి. ఎందుకంటే జీవద్భాషకు నూటికి నూరుపాళ్లు ఏకరూపత ఎక్కడా ఉండదు. పై పెచ్చు ఆరుకోట్లమంది తెలుగువాళ్ళ మాతృభాష అందరికీ ఒక్కతీరుగానే వాడుకలో ఉండడం అనూహ్యం. మాండలిక రూపాలు కొన్నికొన్ని విలక్షణ తలను ప్రదర్శిస్తూనే ఉంటాయి.

కొన్ని మాండలికాల్ని గూర్చి స్థూలంగా స్థాలీపులా కంగా వివరించబడుతుంది. వివరంగా విపులంగా తెలుసు కోవాలంటే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రచు రించిన మాండలిక పదకోశాల్ని చూడండి.

# సాగరసీమ

**విశాఖ, శ్రీకాకుళం మండలాలు :**

ఈ ప్రాంతంలో ఒరియాభాషాప్రభావంవల్ల వచ్చి చేరిన పదాలు కన్పిస్తాయి.

ఉ॥ భోగట్టా=విషయం
కంబారు=పాలేరు
పన్నె =దువ్వెన

ఇలాంటివేగాక గుంట=చిన్న బాలిక, గుంటడు=చిన్న బాలుడు—మున్నగు పదాలు శ్రీకాకుళం, విశాఖప్రాంతాల్లో వినిపిస్తాయి. కన్యాశుల్కంలో గురజాడవారు ఈ ప్రాంతం మాండలికాల్ని కొన్నింటిని ప్రయోగించారు. వాటికి వివరణంగూడ వారివ్వ ముద్రణంలో ఇచ్చారు.

**ఉభయ గోదావరి జిల్లాలు :**

ఈ ప్రాంతంపై అన్యభాషా ప్రభావం లేకపోయినా కొన్ని ప్రత్యేకతల్ని సంతరించుకున్న మాండలిక పదాలు ఇక్కడ వినిపిస్తాయి.

బుల్లెమ్మ=చిన్న అమ్మాయి
బుల్లోడు=చిన్న అబ్బాయి

ఈప్రాంతంలో వినవచ్చే పదబంధాల్నికనుక పరికిస్తే, తెలుగు వాడుకభాష ఎంతవేగంగా మార్పు చెందుతున్నదో అర్థమవుతుంది.

నీళ్లోసుకొని=నీళ్లు పోసుకొని
ఇక్కడదెట్టు=ఇక్కడ అది పెట్టు
పట్రా=పట్టుకురా
భోంచేసిఇటుకేసొచ్చా=భోజనంచేసి ఇటువైపువచ్చా
కగ్గుచ్చుకుని=కగ్గపుచ్చుకొని
ఆళ్లొచ్చారు=వాళ్లు వచ్చారు

వీటిలో వర్ణలోపం బాగా కనిపిస్తుంది. ఉచ్చారణ సౌలభ్యం కోసం రెండు మూడు మాటల్ని ఒక్కమాటగా కుదించడం జరుగుతుంది. ఉభయగోదావరి జిల్లాల వాడుక భాషలో ఈ వర్ణలోపం మరింత ఎక్కువగా కనబడుతుంది. కీర్తిశేషులు భమిడిపాటి కామేశ్వరరావుగారి రచనలను పరిశీలిస్తే, ఈ విషయం స్పష్టమవుతుంది. ఎందుకంటే వారు సజీవమైన వాడుకభాషను స్వీకరించారు. వూగీసలాడ్డం, మరోడేడీ, మరోళ్ళమీదికి, ఇంచక్కటి, తీసిగెళ్ళి — ఇలా ఎన్నిటినో ఉదాహరణలుగా చూపవచ్చు. ఇటువంటి మార్పులు ప్రతిజీవద్భాషలోనూ ఏర్పడుతూనే ఉంటాయి.

**కృష్ణామండలం :**

వస్తా=వత్తా
కుర్రోడు=చిన్నఅబ్బాయి
తెచ్చుద్ది=తెస్తుంది
వచ్చుద్ది=వస్తుంది
వినమాక=వినబోకు

తినడం="తిను"—భావార్థకంలో—ఇలాంటి విలక్షణాలు కృష్ణాజిల్లామాండలికాల్లో కనిపిస్తాయి.

**గుంటూరు మండలం :**

ఇంతవరకు "గేదె" — అని వ్యవహరించ బడింది. కృష్ణానది దాటేసరికి బర్రె అవుతుంది. ఇంతవరకు "ఏమిటి" ఇప్పుడు "ఏంది" అవుతుంది. "తినడం" "తినటం"అవుతుంది.

**ప్రకాశం, నెల్లూరు మండలాలు :**

ఈ మండలాల్లో ప్రవేశించేసరికి, జనులు "వెళ్ళడం" మాని "పోవడం" ప్రారంభిస్తారు. ఒంగోలు చేరేటప్పటికి మాటకు ముందు జనం "నీ పాసుగాలా"అనడం వినిపిస్తుంది. నెల్లూరు వెళ్ళేసరికి "బత్తాయి" కాస్త గజనిమ్మగా మారి పోతుంది. కృష్ణావారి "వినమాక" "వినబాక" గా మారుతుంది.

## రా య ల సీ మ

**చిత్తూరు జిల్లా**

చిత్తూరుజిల్లా భాషపై తమిళభాషాప్రభావం కనిపిస్తుంది.

అంగడి=దుకాణం, కొట్టు
చక్కెర=పంచదార
దుడ్డు=డబ్బు
దోసె=అట్టు
నిండా=ఎక్కువ
శాడుగ=అద్దె

| | |
|---|---|
| బీగం=తాళంచెవి | మస్తుగా=అధికం |
| మూట=బస్తా | వెల=ధర |
| సోంబేరి=సోమరి | సంబళం=జీతం |

ఇందులో అంగడి, దుడ్డు, సంబళం, లాంటి కన్నడంలోగూడా ఉన్నాయి. బత్తాయి కాయను ఉ జిల్లాలో "చీనీ"కాయ అంటారు. జీడిపప్పును ముంతమామి పప్పు అంటారు. ఉల్లిపాయ ఎఱ్ఱగడ్డ అవుతుంది. "బఱ్ఱె ఎనుము అవుతుంది.

కడప మండలం

సాగరసీమలో భాష శరవేగంతో మార్పు చెంద తుంది. కాని రాయలసీమ, తెలంగాణా ప్రాంతాల్లో మార్పు తాబేటి నడకలా సాగుతుంది. "వచ్చినాడు"— అని నేటికీ రాయలసీమ వాడుక. కానీ కోస్తా జిల్లాల్లో "వచ్చాడు"—అని అంటారు. "చూడవలె"—అని రాయల సీమ వారంటే సాగరసీమవారు "చూడాలి" అంటారు.

వాడు అనే సర్వనామం ద్వితీయాది విభక్తి ప్రత్య యాలతో చేరి "వానికి" "వానిచే" మున్నగు రూపాలన పొందుతుంది. కానీ సర్కారు జిల్లాల్లో అమహద్వాచక బహువచనంలో "వాటికి", మహద్వాచక ఏకవచనంలో "వాడికి" అనే విధంగా వ్యవహరించబడుతుంది. కడప మండలంలో "వానికి"—అనే రూపం వినబడుతుంది కాని "వాడికి"—అనే రూపం వినిపించదు. విద్యాధికుల వ్యావ హారికభాష కోస్తావారి వ్యావహారికానికి కాస్త సన్నిహితంగా ఉంటుంది.

**కర్నూలు అనంతపురం మండలాలు**

ఈ జిల్లాల్లోని హిందూపురం, రాయదుర్గ, ఆలూరు, ఆదోని తాలుకాలు కన్నడ ప్రాంతానికి సరిహద్దులు. కావున ఈ ప్రాంతం తెలుగుపై కన్నడ భాషాప్రభావం ఉంది.

ఉద్దులు=మినుములు — ఓళిగలు=బొబ్బట్లు
గెనుసుగడ్డ=చిలగడదుంప — పుంటికూర=గోంగూర
బాళేపండు=అరటిపండు — మడక=నాగలి
ఉర్లగడ్డ=బంగాళదుంప

బేడలు అంటే రెండణాల నాణేలని సర్కారు మండలాల అర్థం. కంది, పెసర, మినప, సెనగ మొదలయిన వాటి పప్పు అని ఈ ప్రాంతంలో అర్థం. బిడ్డ : ఈ శబ్దానికి 'ఆడబిడ్డ'' అని మాత్రమే ఈ ప్రాంతంలో అర్థం. బిడ్డలు లేరు - అంటే మగపిల్లలుకాని, ఆడపిల్లలుకాని లేరని కదా అర్థం! కాని ఈ ప్రాంతంలో "నాబిడ్డ"—అంటే నాకుమార్తె అని అర్థం.

"అప్ప"—అనే శబ్దానికి "అక్కయ్య"—అనే అర్థం సర్కారు జిల్లాల్లో ఉంది. "అప్ప చెల్లెండ్రు"—మున్నగు ప్రయోగాలుగూడా ఉన్నాయి. ఈ ప్రాంతంలో "ఏమప్పా"-అంటే 'ఏమండీ' అని అర్థం. ఇది శ్రేష్ఠతా వాచకంగా పురుషవాచక శబ్దాలచివర చేరుతుంటుంది. "అప్ప" అంటే తమిళంలో "తండ్రి"—అని అర్థం.

అయ్యా—అనే శబ్దం "నాన్న" అనే అర్థంలో సామాన్యుల వ్యవహారంలో వినిపిస్తూంది. శ్రేష్ఠతా వాచకంగా

కూడా "అయ్య" శబ్దాన్ని వాడుతుంటారు. ఈ ప్రాంత మాండలికాల విషయంలో విపులంగా వివరణ కావాలను కుంటే "ప్రజామత"లో నేను వ్రాసిన వ్యాసాన్ని పరికించండి. [ప్రజామత—1970 జనవరి 18]

## తె లం గా ణా

తెలంగాణా తెలుగులో ఉర్దూ భాషాప్రభావం ఉన్నట్టు కనబడుతుంది. ఆ ప్రాంతంలో ఉర్దూ భాషించే ముసల్మాన్లుగూడా బాగా వ్యాపించి ఉన్నారు. ఒకప్పుడు ఈ ప్రాంతాన్ని బహమనీ సుల్తాన్లు పరిపాలించారు. కాబట్టి ఇక్కడి తెలుగుపై ఉర్దూ ప్రాబల్యం కనిపిస్తుంది. అది, ఇది, ఆడ, ఈడ, అట్లా, ఇట్లా లాంటి పదాల ఆరంభంలో ఒక హల్లు చేరి గది, గిది, గాడ, గీడ, గట్లా, గిట్లా—అనే రీతిగా తెలంగాణాలో వినిపిస్తాయి.

"దొరసానిని తోలుకొనిరా"—లాంటి వాక్యాలు తెలంగాణా నుడికారపు వైచిత్రికి మచ్చుతునక. వచ్చి నాడు—అని రాయలసీమలో విన్పించే క్రియారూపం "వచ్చిండు"—అని తెలంగాణాలో వినిపిస్తుంది. సాగర సీమవాసులు "వచ్చాడు"—అంటారు. 'ఇంచు'గాగమం చేర్చి ఉర్దూ మాటల్ని తెలుగు ధాతువులుగా చేసు కోవడం తెలంగాణాలో కనిపిస్తుంది. బనాయించు, రుకా యించు, పిలాయించు లాంటివి ఉదాహరణాలు. శ్రీకాకుళం గుంటడు, గోదావరీ మండలాల్లో బుల్లోడై, తెలంగాణాలో

పోరగాడవుతాడు. సర్కారు జిల్లాల్లోని బత్తాయి (డచ్ పదం) నెల్లూరులో గజనిమ్మకాయగా మారి చిత్తూరులో చీనీకాయ రూపం తీసుకుని తెలంగాణాలో "మోసంబి" (ఉర్దూపదం)గా వ్యవహరించబడుతుంది. సర్కారువారి జీడిపప్పు చిత్తూరు ప్రాంతాల్లో ముంతమామిడిపప్పుగా వ్యవహరించబడి తెలంగాణాలో గోడంబి (ఉర్దూ పదం)గా వ్యవహరించబడుతుంది.

గరీబు, గల్లీ, జరూరు, తకరారు, ములాజా, హమేషా, లుకాసాను, బదనాము—మొదలైనవి తెలంగాణా తెలుగులో విన్పించే ఉర్దూభాషా జన్యాలైన శబ్దాలు.

హైదరాబాదు జిల్లా [వికారాబాద్ తాలూకా]

జోకం లేదు=మోసం లేదు

మాంత ఉన్నవి; మింత ఉన్నవి

[వద్ద—అని 'త'కారానికి అర్థం]

బేకైంది తింటాను (బేకుఅంటే ఇష్టము)

వరంగల్లు ప్రాంతంలో

అత్తడు=వస్తాడు

ఆడ్లు=వడ్లు

అంకాయలు=వంకాయలు

నిజామాబాద్ ప్రాంతంలో

పోణీ [తిరగమాంతపోపు]

కమ్మి [తక్కువ]

మహబూబ్ నగర ప్రాంతంలో

మట్టసంగా [పకడ్బందీగా, గట్టిగా]

కొత్తపెట్టడం=నూతనంగా ప్రారంభించటం

నీవుగుడక నేనుగుడక=నీవుగూడా నేనుగూడా

హైదరాబాదు పరిసరాల్లో

గుసాయించు

కటాయించు

మాండలికరూపాలు కొన్ని కొన్ని విలక్షణతల్ని ప్రదర్శిస్తున్నప్పటికీ వివిధ మాండలికాలమధ్య అల్పమైన భేదాలున్నప్పటికీ శిష్టుల వాడుకలో స్థూలంగా దేశమంతటా సమరూపత కనిపిస్తూంది.

ఉదాహరణకు వస్తున్నాడు—అనే రూపం ఉందనుకోండి, దానికి వస్తుండు, వొస్తున్నాడు, వత్తాండు, అత్తాండు, అత్తండు—మొదలైన మాండలిక రూపాలు ఉన్నాయి.

కాని శిష్టులు "వస్తున్నాడు"—అనే ఒక్క రూపాన్నే వాడుతున్నారు. అలాగే "వస్తోంది", "వస్తూంది", "వస్తూ ఉంది", "వస్తున్నది" అని వైవిధ్యంగా ఉన్న మాండలిక రూపాల్లో శిష్టులు "వస్తోంది" అన్నరూపాన్నే వాడుతున్నారు. ఆవిధంగానే "అట్లాటి", "అట్లాటి", "అల్లాటి", "అలాటి"—అన్నరూపాల్లో "అలాటి" అన్నరూపం ఎక్కువగా కనిపిస్తోంది. చూశాడు, చూసినాడు,

చూసిండు—అన్నరూపాలు వరుసగా సర్కారు, రాయలసీమ, తెలంగాణాల్లో వాడుకలో ఉన్నరూపాలు. కాని మూడుప్రాంతాల్లోని శిష్టులు ఎక్కువగా వాడుతున్నది "చూశాడు" అన్నరూపమే. ఈ రకంగాచూస్తే మాండలిక వైవిధ్యంలో ఏకత్వం కనిపిస్తుంది. ఆ ఏకత్వాన్నే ఆధునిక ప్రమాణభాష అంటారు.

"భిన్నత్వంలో ఏకత్వం! అదే చైతన్యం
వైవిధ్యంలేని ఏకత్వం! అదే మృత్యువు"

# సామాన్య దోషాలు

సూచన : గ్రాంథిక భాషలో "ము" వర్ణాంత పదాల్లోని "ము" వర్ణం, శిష్టవ్యావహారికంలో పూర్ణానుస్వారంగా (వైకల్పికంగా) మారుతుంది.

| తప్పు | ఒప్పు |
|---|---|
| అవలంబ్ించు | అవలంబించు |
| అధ్దం | అద్దం |
| అస్తి | అస్థి |
| అడివి | అడవి |
| అంబోధి | అంభోధి |
| అద్రుష్టం | అదృష్టం |
| అవస్త | అవస్థ |
| అపద్దం | అబద్ధం |
| అబ్యసించు | అభ్యసించు |
| అశ్వస్తత<br>అస్వస్తత | అస్వస్థత |
| అనుష్టానం | అనుష్ఠానం |
| అమ్రుతం | అమృతం |
| అకండం | అఖండం |
| అశేతనం | అచేతనం |
| అన్రుతం | అనృతం |
| అశూయ | అసూయ |

| తప్పు | ఒప్పు |
|---|---|
| అస్థమించు | అస్తమించు |
| అస్రువులు | అశ్రువులు |
| అరన్యం | అరణ్యం |
| అవుషదం | ఔషధం |
| అవుసరం | అవసరం |
| అనిగి | అణిగి |
| అద్యక్షుడు | అధ్యక్షుడు |
| అప్రస్థుతం | అప్రస్తుతం |
| అతితి | అతిథి |
| అభివృద్ది | అభివృద్ధి |
| అతివృష్ఠి | అతివృష్టి |
| అగ్నానం | అజ్ఞానం |
| ఆశ్చెర్యం<br>హాశ్చర్యం | ఆశ్చర్యం |
| ఆసీర్వాదం | ఆశీర్వాదం |
| ఆశ్వాదించు | ఆస్వాదించు |
| ఆశక్తి | ఆసక్తి |
| ఆలశ్యం | ఆలస్యం |
| ఆస్థి | ఆస్తి |
| ఆగ్న | ఆజ్ఞ |
| ఇష్ఠం | ఇష్టం |
| ఇస్తర్లు | విస్తరలు |
| ఉధారం | ఉదారం |

| తప్పు | ఒప్పు |
| --- | --- |
| ఉవ్విల్లూరు | ఉవ్విళ్లూరు |
| ఉధ్రేకం | ఉద్రేకం |
| ఉపధ్యాయుడు | ఉపాధ్యాయుడు |
| ఉద్దరించు | ఉద్ధరించు |
| ఉచ్ఛారణ | ఉచ్చారణ |
| ఊస్మం | ఊష్మం |
| ఋగ్వేధం | ఋగ్వేదం |
| ఎల్ల వేలలు | ఎల్ల వేళలు |
| ఎగర | ఎగుర |
| ఎలిక | ఎలుక |
| ఏనుగ | ఏనుగు |
| ఐఖ్యం | ఐక్యం |
| ఐఖ్యమత్యము | ఐకమత్యం |
| ఔదర్యం<br>ఔధార్యం | ఔదార్యం |
| ఔశధి | ఓషధి |
| ఔసరం | అవసరం |
| కస్టం<br>కష్ఠం | కష్టం |
| కర్నుడు | కర్ణుడు |
| కఠ్నం | కట్నం |
| కళహం | కలహం |
| కడ్గం | ఖడ్గం |

| తప్పు | ఒప్పు |
|---|---|
| కవిశార్వభౌముడు | కవిసార్వభౌముడు |
| కవుగలించు | కౌగలించు |
| కన్నుతో | కంటితో |
| కాయితం | కాగితం |
| కార్తవ్యం | కర్తవ్యం |
| కాంచించు | కాంక్షించు |
| కాంక్ష్య | కాంక్ష |
| కాల్భలం | కాల్బలం |
| కాటిక | కాటుక |
| క్రిషి, క్రుషి | కృషి |
| కుటుంభం | కుటుంబం |
| కుచితబుద్ది | కుత్సితబుద్ధి |
| కుభేరుడు | కుబేరుడు |
| కూపస్త | కూపస్థ |
| క్రుత్యం | కృత్యం |
| క్రుష్ణుడు | కృష్ణుడు |
| క్రుత్రిమం | కృత్రిమం |
| కౄరుడు | క్రూరుడు |
| కౄంగు | క్రుంగు |
| కౄంకు | క్రుంకు |
| కౌంచం | కౌంచెం |
| గారాభం | గారాబం |
| గృహాస్తులు | గృహస్థులు |

| తప్పు | ఒప్పు |
|---|---|
| గోరం | ఘోరం |
| గోప్ప | గొప్ప |
| గోయిలో | గోతిలో |
| ఘాడనిద్ర | గాఢనిద్ర |
| ఘణుడు | ఘనుడు |
| చంధస్సు | ఛందస్సు |
| చలికత్తె | చెలికత్తె |
| చిత్తసుద్ది | చిత్తశుద్ధి |
| చాతగాదు | చేతకాదు |
| చామంతి | చేమంతి |
| చిలక | చిలుక |
| చూసి | చూచి |
| చెందమామ | చందమామ |
| చెంపకమాల | చంపకమాల |
| చెంద్రగిరి | చంద్రగిరి |
| చెంద్రుడు | చంద్రుడు |
| చెముడు | చెవుడు |
| చెంచెల | చంచల |
| చెమత్కారం | చమత్కారం |
| చెప్పమని | చెప్పుమని |
| చేష్ఠ | చేష్ట |
| జబాబు | జవాబు |
| జాగర్త | జాగ్రత్త |

| తప్పు | ఒప్పు |
| --- | --- |
| జెలం | జలం |
| త్రుతీయ | తృతీయ |
| తెల్దు | తెలియదు |
| తొవ్వ | త్రవ్వ |
| దండనాదులు | దండనాథులు |
| దయాద్రబుద్ది | దయార్ద్రబుద్ధి |
| దక్షణం | దక్షిణం |
| దరిద్రం | దారిద్ర్యం |
| దనుస్సు | ధనుస్సు |
| దారుడ్యం | దారుఢ్యం |
| ధానధర్మాలు | దానధర్మాలు |
| దారిద్రులు | దరిద్రులు |
| ద్యానం | ధ్యానం |
| ధీనుడు | దీనుడు |
| ధీక్ష | దీక్ష |
| ధ్విరుక్తం | ద్విరుక్తం |
| దుహ్ఖించు | దుఃఖించు |
| దుస్తితి | దుస్థితి |
| దృతరాష్టుడు<br>ద్రుతరాష్ట్రుడు | ధృతరాష్ట్రుడు |
| దృష్టాంతరం | దృష్టాంతం |
| దుృశ్యం | దృశ్యం |
| దృడ | దృఢ |

| తప్పు | ఒప్పు |
|---|---|
| దేముడు | దేవుడు |
| ద్రౌపతి | ద్రౌపది |
| ధర్పణం | దర్పణం |
| నరసింహ్మం<br>నరసింహ్వం | నరసింహం |
| నష్ఠం | నష్టం |
| నిష్పలం | నిష్ఫలం |
| నివశించు | నివసించు |
| నిర్నయించు | నిర్ణయించు |
| నియమబద్దకం | నియమబద్ధం |
| నిర్విగ్నం | నిర్విఘ్నం |
| నిమషం | నిమిషం |
| నిర్బందం | నిర్బంధం |
| నెరిశేయి | నెరిశాయి |
| నైపున్యం | నైపుణ్యం |
| పండగ | పండుగ |
| పద్దతి | పద్ధతి |
| పరియవసానం | పర్యవసానం |
| పన్నుతో | పంటితో |
| పరిస్థుతులు | పరిస్థితులు |
| పధ్యం | పద్యం |
| పారిశుద్యం | పారిశుద్ధ్యం |
| పిచాచులు | పిశాచులు |

| తప్పు | ఒప్పు |
|---|---|
| పుస్తుకం | పుస్తకం |
| పౌర్ణమి | పూర్ణిమ |
| ప్రస్థుతం | ప్రస్తుతం |
| ప్రశస్థి | ప్రశస్తి |
| ప్రక్రుతి | ప్రకృతి |
| ప్రతిష్ట | ప్రతిష్ఠ |
| ప్రతిభింబించు | ప్రతిబింబించు |
| ప్రతిజ్ఞ, ప్రతిగ్ఞ | ప్రతిజ్ఞ |
| ప్రవేసించు | ప్రవేశించు |
| ప్రలయం | ప్రళయం |
| ప్రియతమ్ముడు | ప్రియమైన తమ్ముడు<br>ప్రియసోదరుడు |
| బధ్ధకం | బద్ధకం |
| బక్తుడు | భక్తుడు |
| బాలులు | బాలురు |
| బాలింత | బాలెంత |
| ఋగ్వేదం | ఋగ్వేదం |
| బేదం | భేదం |
| బ్రంహ్మ | బ్రహ్మ |
| బ్రాహ్మడు<br>బ్రాహ్మనుడు | బ్రాహ్మణుడు |
| భాగస్తులు | భాగస్థులు |
| భలం | బలం |

| తప్పు | ఒప్పు |
|---|---|
| భాద్యత | బాధ్యత |
| భాద | బాధ |
| భోధ | బోధ |
| మహాత్యం | మాహాత్యం, మాహాత్మ్యం |
| మధ్యాన్నం | మధ్యాహ్నం |
| మన్నుతో | మంటితో |
| మాత్రు | మాతృ |
| మచ్చకంటి | మచ్చెకంటి |
| మధ్యపానం | మద్యపానం |
| మాతాపితరులు | మాతాపితలు |
| మ్రుగం | మృగం |
| మొదులు | మొదలు |
| మొలుచు | మొలచు |
| మొగుడు | మగడు |
| యవ్వనం | యౌవనం |
| యగ్నం | యజ్ఞం |
| యడల | యెడల |
| యుద్దం | యుద్ధం |
| రజితం | రజతం |
| రాయభారం | రాయబారం |
| రాశిన | రాసిన |
| లంచకొండితనం | లంచగొండితనం |
| లెఖ్ఖ | లెక్క |

| తప్పు | ఒప్పు |
|---|---|
| వరస | వరుస |
| వప్పగించు | ఒప్పగించు |
| వప్పందం | ఒప్పందం |
| వప్పుకోను | ఒప్పుకోను |
| వశిష్టుడు | వసిష్ఠుడు |
| వయిద్యం | వైద్యం |
| వరహావతారం | వరాహావతారం |
| వకటి | ఒకటి |
| వాఖ్యం | వాక్యం |
| వాచ్ఛల్యం | వాత్సల్యం |
| వాగ్మయం | వాఙ్మయం |
| విధ్య | విద్య |
| విస్వాసం | విశ్వాసం |
| విరుద్దం | విరుద్ధం |
| విద్యుశ్చక్తి | విద్యుచ్ఛక్తి |
| విద్యుశ్ఛక్తి | |
| విధ్యార్దులు | విద్యార్థులు |
| విశిష్ట | విశిష్ఠ |
| వృద్ది | వృద్ధి |
| వెవసాయం | వ్యవసాయం |
| వెంట్రుకలు | వెండ్రుకలు |
| వెలపలికి | వెలుపలికి |
| వెతిరేకం | వ్యతిరేకం |

| తప్పు | ఒప్పు |
|---|---|
| ప్రయం | వ్యయం |
| ప్రాశి | ప్రాసి, రాసి |
| శతృభయం | శత్రుభయం |
| శనెగపిండి | శనగపిండి |
| శతాబ్ధం | శతాబ్దం |
| శతగ్ని | శతఘ్ని |
| శబదం | శపథం |
| శబ్ధం | శబ్దం |
| శామంతి | చేమంతి |
| శానా | చాలా |
| శాశ్వితం | శాశ్వతం |
| శాఖం | శాకం |
| శాస్త్రృగ్నులు | శాస్త్రిజ్ఞులు |
| శిశ్రూష | శుశ్రూష |
| శింధూర | సిందూర |
| శిశ్యులు | శిష్యులు |
| శీతాదేవి | సీతాదేవి |
| శులభం | సులభం |
| శెలవు, శెలవ్ శలవు | సెలవు |
| శెకటం | శకటం |
| శ్రద్ద | శ్రద్ధ |
| శ్రేష్టం | శ్రేష్ఠం |

| | |
|---|---|
| సంబందం | సంబంధం |
| సంస్క్రుత | సంస్కృత |
| సన్యశించు | సన్యసించు |
| సమాదానం | సమాధానం |
| సవ్యచాచి | సవ్యసాచి |
| సారాంసం | సారాంశం |
| సామంత్రులు | సామంతులు |
| సామగ్ర్యలు | సామగ్రి |
| సాఌతె | సామెత |
| సిరోజాలు | శిరోజాలు |
| సింహ్మం | సింహం |
| సిశువు | శిశువు |
| సీతాకాలం | శీతాకాలం |
| సీగ్రం | శీఘ్రం |
| సుక్రుతం | సుకృతం |
| సూర్యరస్మి | సూర్యరశ్మి |
| సూక్ష్మజీవులు | సూక్ష్మజీవులు |
| సూన్యం | శూన్యం |
| సూర్పణక | శూర్పణక |
| సృతి | శ్రుతి |
| సృంగారం | శృంగారం |
| సెయ్య | శయ్య |
| సాంజ్ఞ | సంజ్ఞ |

| తప్పు | ఒప్పు |
|---|---|
| సౌక్యం | సౌఖ్యం |
| స్తలం | స్థలం |
| స్వస్థి | స్వస్తి |
| స్పష్ఠం | స్పష్టం |
| స్మశానం | శ్మశానం |
| స్లాఘించు | శ్లాఘించు |
| స్రావ్యం | శ్రావ్యం |
| స్వాతంత్రియం | స్వాతంత్ర్యం |
| స్తానం | స్థానం |
| స్తితి | స్థితి |
| స్రుష్టి, సృష్ఠి | సృష్టి |
| స్రుమ్తి | స్మృతి |
| హాళ్లు | హాల్లు |
| హస్తమించు | అస్తమించు |
| హాస్వం | హ్రాస్వం |
| హంశం | అంశం |
| హంతఃకలహం | అంతఃకలహం |
| హరిచ్చంద్రుడు | హరిశ్చంద్రుడు |
| హరిజనభయంకరుడు | అరిజనభయంకరుడు |
| హస్త్రశస్త్రవిద్యలు | అస్త్రశస్త్రవిద్యలు |
| హిరణ్యాకసిపుడు | హిరణ్యాకశిపుడు |
| హ్రుదయానందం | హృదయానందం |
| క్షణంబగురం | క్షణభంగురం |

# 2

## కథ — కథానిక

సాహిత్యం మానవజీవితానికి అమరత్వాన్ని కూర్చే మహత్తర సాధనం. సాహిత్యం మానవహృదయాన్ని ఆనంద డోలికల్లో ఊగించి నూతన చైతన్యాన్ని రేకెత్తిస్తుంది. సాహిత్యం విభిన్నాభిరుచుల కాలవాలమైన మానవ ప్రకృతికి సంతృప్తిని సంతోషాన్ని చేకూరుస్తుంది. మానవ చిత్తవికాసాన్ని గలుగజేసే శక్తి దానికుంది.

నేటి మానవునికీ ప్రబంధయుగంనాటి మానవునికీ చాలా తేడా ఉంది. నాడు నిసుపహాతి స్థలం, రమణీ ప్రియ దూతికలు తెచ్చి ఇచ్చే కప్పురపీడెం ఉండినగాని కవిత్వం వచ్చేదికాదు. నేటి మానవునికి ఆర్థిక చింతన మధికమైంది. జీవనోపాధి నార్జించడం ఒక పెద్ద సమస్యగా పరిణమించింది. తీరిక, సహనం సన్నగిల్లుతున్నాయి. కొండవీటి చేంతాళ్ళ వంటి గ్రంథాల్ని బంధచిత్రకవిత్వాల్ని చదివే సహనం నేటివారికి లేదు.

మానవ జీవితానికి అనుగుణంగానే సాహిత్య రూపాలు ఏర్పడుతాయి. నేటి సాహిత్యానికి వస్తువు దేవదానవుల యుద్ధాలు కాదు. సూర్యరశ్మినే తట్టుకోనజాలని అసూర్యం

పశ్యాలు నేటికావ్యానికి నాయికలుకారు. చెమటోడ్చే కష్టజీవి నేటిసాహిత్యానికి కథానాయకుడు. నేటి సాహిత్యానికి మానవజీవిత విమర్శనమే ముఖ్య లక్ష్యం. ఈ మార్పులన్నీ జాతీయ పునరుజ్జీవనోద్యమం ఫలితంగా ప్రారంభమై ఆంగ్లేయ సాహిత్యంలో పందొమ్మిదో శతాబ్దం చివరిభాగానికి పరిపుష్టత నందినాయి.

ఆంధ్రసాహిత్యం పందొమ్మిదో శతాబ్దం వరకు ఏవో కొన్ని పరిమిత సాహిత్యప్రక్రియలతో సాగింది. వీరేశలింగం గారు ఆంగ్లసాహిత్య ప్రభావంతో విభిన్న సాహిత్యశాఖల్ని తెలుగు సాహిత్యానికి పరిచయం చేశారు. వీరేశలింగంగారు తెలుగున ప్రవేశపెట్టని సాహిత్యరూపాలు ఒకటి రెండు మాత్రమే. ఆధునిక సాహిత్యంలో అత్యుత్తమ స్థానాన్ని అందుకున్న "కథ—కథానిక" వీరేశలింగంగారి చేతుల నుండి తప్పించుకున్నాయి. అలాగవి తప్పించుకొనడానికి కారణాలు లేకపోలేదు. ఈ శాఖలకు అనుసరణీయమైన వ్యావహారిక భాష అప్పుడు అంగీకారం కాలేదు. ఈ నూతన సాహిత్యప్రక్రియను ఆంగ్లసాహిత్యంనుండి మన సాహిత్యంలో ప్రవేశపెట్టినవారు గురజాడ అప్పారావుగారు.

తెలుగు సాహిత్యంలో కథాసాహితి ఒక ప్రత్యేక శాఖ. ఇది నేడు ప్రపంచ బహుమతులందుకునే ఉత్తమ స్థాయికి పురోగమించింది.

ఈనాడు పాఠకులను అధికంగా ఆకర్షించేది కథ. దీనికి ప్రథమ నిదర్శనం నేడు వెలువడే కథా సంపుటాలు. పత్రిక ల్లో వెలువడే కథలు. మనలో చాలమందికి ఉబుసుపోకకు

కథలు చదివి, ఏదో ఒకరీతి కాలక్షేపమైనందుకు సంత సించడం అలవాటైంది. అలాంటి చదువు ప్రయోజనకారి కాదు. మంచి చెడ్డల్ని సవిమర్శకంగా చదివేటప్పుడు చిత్త వికాసం కలిగి పాఠకుడిలో గొప్పమార్పుకు కారణ మవుతుంది.

ఈ సాహిత్యంలో ముఖ్యంగా పేర్కొనదగింది చిన్న కథ లేక కథానిక. దీనినే ఇంగ్లీషు భాషలో "షార్ట్ స్టోరీ" [ Short Story ] అంటారు. ఈ నవీన సాహిత్యసృష్టి ప్రాపంచి కేతివృత్తం ప్రకటించడానికి అనువైంది. చిన్న కథలో సమాజంలోని ఏసంఘటననైనా తీసుకుని చిత్రించవచ్చును. చిన్న కథలోని పాత్రలను కొంతకాలం కలుసుకుంటాము. తక్కువకాలంలో అవి పాఠకుణ్ణి సంతోషపెడుతాయి. ఇక్కడే చిన్న కథకు నవలకు తేడా కనిపిస్తుంది. నవల జీవి తాన్ని సంపూర్ణంగా చిత్రిస్తుంది. చిన్నకథలో జీవితంలోని రసవత్తరఘట్ట మొకటి మాత్రం ప్రదర్శితం. నవలలో కాలం దీర్ఘంగా ఉంటుంది. ప్రసిద్ధ ఆంగ్లేయ కథకుడు స్టీవెన్‌సన్ (Stevenson) కథానికను గురించి తన అభిప్రాయాన్ని ఈ క్రింది విధంగా వెలువరించాడు—"నాకు తెలిసినంతవరకు కథలు రాయడానికి మూడేమూడు మార్గాలున్నాయి. ఒక సంఘటనను తీసుకుని దానికనువైన పాత్రలను సృష్టించాలి; లేదా పాత్రలను గైకొని వాటిని చిత్రించడాని కనువైన సంఘటనను కల్పించాలి; లేదా ఒక మనోవృత్తిని కల్పించ నెంచి దానిని వివరించడానికి కావలసిన సంఘటనను, పాత్ర లను సృష్టించాలి."

చిన్న కథలో ప్రారంభం, ముగింపు రచయిత నేర్పుకు నికషోపలం. క్రియాత్మకంగానో వర్ణనాత్మకంగానో కథాని కల్ని ప్రారంభిస్తారు. ఉదాహరణకి గురజాడవారి 'దిద్దు బాటు'లో గోపాలరావు తలుపు తట్టుడంతో కథ ప్రారంభ మైంది. అంటే క్రియాత్మకమైన ప్రారంభ మన్నమాట. ఈ విధమైన కథలు అనేకుల్ని ఆకర్షిస్తాయి. వర్ణనలతో ప్రారం భించే రచయితలు కథానికా కళలో నేర్పరులైతేగాని విజయం సాధించలేరు. ముగింపు చమత్కారయుతమై ఆశ్చ ర్యాన్ని కలుగజేసేదిగా ఉంటే చాలా ఆకర్షణీయంగా ఉంటుంది. కథానిక పరాకాష్ఠ (Climax) దశనుండి ముగిం పుకువచ్చేప్పుడు చమత్కారం ప్రదర్శితం కాకపోతే పేలవమై పోయే ప్రమాద ముంది.

చిన్న కథలో ప్రతివాక్యాన్ని తూచి తూచి వాడాలి. ముందేమి జరుగుతుందో అనే కౌతుకం రేపాలి. రచయిత తన కథానికవైపు పాఠకుడి దృష్టిని మరలించాలంటే శీర్షికా నిర్ణయం చాలా ప్రతిభావంతంగా ఉండాలి. కథా కథనం విషయంలో అడుగడుగునా మెలకువతో మెలగాలి. సంభా షణలద్వారా జరిపించే కథల్లో పాత్రల శీలానుగుణంగా సంభాషణలు జరగాలి. అవసరాన్నిబట్టి ఆనుషంగికమైన వర్ణనలు అక్కడక్కడా పరిమితంగా ఉంటే సరిపోతుంది. ఈ విధంగా కథానికా శిల్పాన్ని పోషించి రచన కొనసాగిస్తే చిన్న కథ ఆకర్షణీయమైన ఒక కళాఖండంగా విలసిల్లుతుంది. కథానికలో ప్రయోజనం, ఆదర్శం—అనేవికూడా సాధించ వీలవుతుంది. బోధించదలచిన ఆదర్శం, సాధించవలసిన

ప్రయోజనం వ్యంగ్యంగా స్ఫురించేట్లు పాఠకుడి భావానికి విడవాలి. సంఘదురాచారాలను ఖండించడానికి మానవ సంస్కారానికీ చిన్నకథ చాలా ఉపయుక్తమైంది. దీని పూర్తి లక్షణాలు అప్పారావుగారి 'దిద్దుబాటు' 'మెటిల్డా' మొదలగు కథానికల్లో చూడవచ్చు.

కథా సాహిత్యంలో రెండవదిగా నెంచదగింది కథ లేక పెద్దకథ. దీనిని ఆంగ్లభాషలో స్టోరీ (Story) అంటారు.

ఇందులో అనేక సంఘటన లున్నప్పటికిని ప్రయోజనం ఒకటిగా ఉండాలి. ఇంచుమించు కథానికవంటిదే కథ. దీనిలో జీవితాన్ని చిత్రించరాదు. అలా చిత్రిస్తే కథ కాకుండా నవలగా మారుతుంది. చలంగారి 'అరుణ' పెద్దకథకు చక్కని ఉదాహరణ. 'అరుణ' ఒక గొప్పకళాఖండం. ప్రేమకీ కామానికీ మధ్య ఊగులాడే పదికంటె తక్కువ పాత్రల్ని కలిగి రెండురోజుల్లో జరిగిన సంఘటనలను చిత్రించే కథ. అరుణకి చావు లేదనిపిస్తుంది.

ఈ సాహిత్యంలో మూడవదిగా ఎంచదగింది 'గల్పిక' లేక 'చిత్రణ'. దీనినే 'కథనం' — అనికూడా అంటారు. దీన్నే ఆంగ్లంలో స్కెచ్ (Sketch) అంటారు.

కథానాయికను గాని, నాయకునిగాని గురించిన భావ చిత్రం పాఠకుడి హృదయంలో ఇతర పాత్రల సంభాషణల ద్వారాగాని, అందులోని పాత్రల సంభాషణలద్వారాగాని చిత్రించడం చిత్రణ.

ఇంగ్లండు లాంటి దేశాల్లో చిన్న కథ రచన సాగించు రచయితలు డబ్బు ఖర్చుచేసి, వివిధాలైన ప్రాంతాల్ని సందర్శించి, విభిన్ననాగరికతల కలవద్ద ప్రజల్ని కలుసుకుని పరమాద్భుతమైన మానవ ప్రకృతిని చిన్న కథలద్వారా చిత్రిస్తారు. పత్రికలవారు రచయితల కృషికి తగిన ప్రతిఫలం అందజేస్తారు. అందువల్ల కథానికాశిల్పం చాలా అభివృద్ధి చెంది, చిన్న కథలకు మంచి విలువ ఏర్పడింది. అత్యుత్తమ కథానికలు సృష్టించబడుతున్నాయి. తెలుగులో కథానికా శిల్పం ఇంచుమించు ఆంగ్లకథాసాహిత్యస్థాయినందుకు నేంతగా అభివృద్ధి చెందింది.

# గేయరచన

గేయమంటే పాట. గేయమంటే గానంచేయడానికి వీలైంది. పాట అంటే పాడటానికి అనువైంది. ఆధునికులు కొందరు ఛందస్సు నతిక్రమించి వచనగేయాలు రాస్తున్నారు. వాటిలో అంతర్లయ ఉంటుంది. అలాకాకుండా గానానికి వీలైన గేయాల్ని మాత్రాచ్ఛందస్సులో రచించవచ్చు. ఇలాంటి గేయాలకు తాళంపడుతూ ఉండాలి. శ్రవణానందంగా ఉండి ఫణితిఉండాలి. మాత్రాచ్ఛందస్సును గూర్చి కొంత తెలుసుకొందాం.

గేయరచనలో యతులకు, ప్రాసలకు అవస్థపడవలసిన అవసరంలేదు. నడక నిరాటంకంగా సాగుటయే గేయరచనకు బీజమనక తప్పదు.

## గురులఘువుల పరిజ్ఞానం

చిటికవేయడానికి పట్టేకాలాన్ని మాత్రాకాలం అంటారు. ఒక మాత్రాకాలంలో ఉచ్చరించబడే అక్షరాన్ని లఘువు అంటారు. రెండుమాత్రలకాలంలో ఉచ్చరించబడే అక్షరాన్ని గురువు అంటారు. । — లఘువుకు సంజ్ఞ; ◡ — గురువుకు సంజ్ఞ. మూడు మాత్రలకాలంలో పలుకబడే అక్షరాన్ని ప్లుతమంటారు. నాలుగు మాత్రలకాలంలో పలుకబడే అక్షరాన్ని కాకపాద మంటారు. వీటికి సంజ్ఞలులేవు.

గురువులు

1. దీర్ఘాక్షరాలు;
   ఉదా॥ ఆ, ఈ, ఊ, ౠ, ౡ, ఏ, ఐ, ఓ, ఔలును;

   వీటితో గూడిన హల్లులును.
   ఉదా॥ కా, చే, తో

2. పూర్ణబిందువుతో గూడిన అక్షరాలు
   ఉదా॥ నం, వం, పం

3. విసర్గతో గూడిన అక్షరాలు
   ఉదా॥ 'దుః'ఖము, అం'తః'పురము

4. పొల్లుహల్లులతో గూడిన అక్షరాలు.
   ఉదా॥ కన్, సత్, కాంచన్.

5. సంయుక్తాక్షరాలకు ముందుండే అక్షరాలు.
   ఉదా॥ 'స'త్యము, 'ని'త్యము

6. ద్విత్వాక్షరాలకు ముందుండే అక్షరాలు
   ఉదా॥ 'అ'క్క, 'అ'త్త

విశేష వివరణ

పదమధ్యంలో సంయుక్తాక్షరానికీ ద్విత్వాక్షరానికీ ముందుండు అక్షరమే గురువవుతుంది. రెండవ పదం మొదటి అక్షరం సంయుక్తమో ద్విత్వమో అయి మొదటి పదంలోని చివరి అక్షరం లఘువైతే, అది కొన్ని సందర్భాల్లో లఘువుగా ఉంటుందేగాని గురువుకాదు.

**లఘువులు**

పై చెప్పబడినవి కాక తక్కినవి.

ఉదా॥ అ, ఇ, ఉ, ఋ, ఌ, ఎ, ఒ - మున్నగు అచ్చులు;

వీటితో గూడిన హల్లులు.

ఉదా॥ క, చె, తొ

విశేష వివరణ

గేయాల్లో పాదాల చివరనున్న లఘువు ఒక్కొక్కప్పుడు గురువవుతుంది.

## గణాలు

గేయాల్లో ముఖ్యంగా నాలుగు రకాలైన గణాలు ఉంటాయి.

I త్రిమాత్రాగణాలు. ఇవి మూడు.

(1) । । । - పలక

(2) ဎ । - రాయి

(3) । ဎ - ప్రభూ

II చతుర్మాత్రాగణాలు. ఇవి ఐదు.

(1) । । । । - వరదుడు

(2) ဎ । । - సోముడు

(3) । ဎ । - జగత్తు

(4) । । ဎ - రమణా

(5) । ဎ ဎ - రాధా

**III** పంచమాత్రాగణాలు. ఇవి ఎనిమిది.

(1) I I I I I – కమలములు
(2) U I I I – కంఠమున
(3) I U I I – ఉమాపతి
(4) I I U I – కమలాక్షి
(5) I I I U – ప్రియముగా
(6) U I U – భూమిపై
(7) U U I – అమ్మమ్మ
(8) I U U – ఎలాగో

**IV** షణ్మాత్రాగణాలు. ఇవి పదమూడు

(1) I I I I I I – పలువిధములు
(2) U I I I I – అంబుధిగని
(3) I U I I I – విశారదుడు
(4) I I U I I – కరుణామయి
(5) I I I U I – అరుణహస్త
(6) I I I I U – జగములలో
(7) U I I U – యాతనతో
(8) I U I U – శుభావహం
(9) I I U U – వినవింపో
(10) U I U I – చంద్రకాంత
(11) U U I I – శ్రీనాథుడు
(12) U U U – శ్రీనాథా !
(13) I U U I – నినాదంబు

గణవిభజన

```
      5            5
  U   U   |     | |  U  |
(1) కై లా స    శి ఖ రా న

     5            5
  U  |  | |     U  U  |
  క ల్కి సి గ    పూ దా ని

   5           5
  U  U  |     U  |  U
  క న్యా కు    మా రి లో

   5              5
  U  |  U     | |  | | |
  కా లి అం    దె ల ర వ ళి
```

[కొనకళ్ళ వెంకటరత్నం]

గేయం మొత్తం మీద ఒకే విధమైన గణాలుండాలి. ఒకపాదంలో పంచమాత్రా గణాలు మరొక పాదంలో త్రిమాత్రా గణాలుండరాదు. పై గేయంలో అన్నిపాదాల్లోనూ అన్నీ పంచమాత్రా గణాలే ఉన్నాయి.

```
       3        4         3    4
      U |     U  | |     U |  U  | |
(2)  శ్రీ లు   పొం గి న   జీ వ  గ డ్డ యి

      3        4         3      4
     U |     U  | |     U  |  U  | |
     పా లు   పా రి న   భా గ్య సీ మ యి

      3     4          3          4
     U |   | |  U    | |  |    U  | |
     వ్రా లి  న ది యా  భ ర త   ఖం డ ము
```

[రాయప్రోలు సుబ్బారావు]

పైగేయంలో గణాలు 3+4+3+4 అనే క్రమంలో ఉన్నాయి. పాదంలో రెండు రకాలున్నట్లు కనిపిస్తుంది. కాని (3+4). ఇవి మిశ్రగణాలుగా ఉపయోగించబడ్డాయి. గేయం మొత్తంలో (3+4) అనే మిశ్రగణాలే ఉన్నాయి. ఇలా ఉపయోగించి కూడా గేయాలు అల్లవచ్చు.

3 4 3 4
U I  U I I  I I I  U I I
(3) వే ద  శా ఖ లు  వె లి సె  ని చ్చ ట

3 4 3 4
U I  U U  I I I  U I I
ఆ ది  కా వ్యం  బ ల రె  ని చ్చ ట

3 4 3 4
U I  U I I I  I I I  I I I I
బా ద  రా య ణ  ప ర మ  ఋ షు ల కు

3 4 3 2
U I  U I I  U I  U
పా దు  సు మ్మ ది  చె ల్లె  లా

3 4 3 4
U I  U I I  I U  U I I
(4) దే శ  గ ర్వ ము  దీ ప్తి  చెం ద గ

3 4 3 4
U I  I I I I  U I  U I I
దే శ  చ రి త ము  తే జ  రి ల్ల గ

3 4 3 4
U I  I I I I  U I  I I I I
దే శ  మ ర సి న  ధీ ర  పు రు షు లు

3 4 3 2
I I I  U I I  U I  U
తె లి సి  పా డ ర  త మ్ము  డా!

గేయాల్లో ప్రతిపాదంలోను సరి గణాలు ఉండాలిగాని బేసి గణాలుండరాదు. కాని పై గేయాల్లో నాలుగోపాదం చివర రెండు మాత్రలు లోపించినట్లు కనిపిస్తుంది. కానీ "లా" "డా"—అనేవి కాకపాదాలు. అంటే వాటిలో ఒక్కొక్కదాన్ని నాలుగు మాత్రలకాలం ఉచ్చరించాలి. కాబట్టి పై రెండు గేయాల్లో సరి గణాలే ఉన్నవని తెలుసుకోవాలి. పాదాల్లో ఉన్న గణాల్లో కొన్నిటికి తక్కువ అక్షరాలున్నప్పుడు ఆ అక్షరాల్ని అట్టి గణాలకు సరిపోయేటట్లు పాడుకోవాలి. లేకుంటే ఛందస్సు తప్పుగా కన్పిస్తుంది. గేయాల్లో అక్షరాలు, గణాలు తగ్గితే వాటికి అందం వస్తుంది. కాని పాడేటప్పుడుమాత్రం అక్షరాలూ, గణాలూ సమంగా ఉన్నట్లు పాడుకోవాలి.

## వచన గేయం

గేయం నియమిత మాత్రలతో నడుస్తుంది. గేయంలో గతిఉంటుంది. వచనగేయంలో మాత్రానియమంగానీ గతిగానీ ఉండదు. వచనగేయానికి లయ ముఖ్యం. ఈ'లయ' గణాల్ని కూర్చడంతోనే ఉత్పన్నంకాదు. ఒకానొక ఊపులో పదాల్ని గుప్పించడంవల్ల ఈ లయ ఏర్పడుతుంది. పాఠకునిలో భావోద్వేగం కల్గించే "అంతర్లయ" లేక "భావలయ"వచనగేయం ప్రధాన లక్షణం. ఈ "అంతర్లయే" వచన గేయాన్ని వచనం నుండి వేరుపరుస్తుంది. ఒకప్పుడీ వచనగేయం మంద మందంగా నడుస్తుంది. ఇంకొకప్పుడు

మహోధాటిలో పరుగిడుతుంది. మరొకప్పుడు చటుక్కున విరిగి విరిగి సాగుతుంది. వచనగేయంలో నిరాడంబరత, తూగు, అంత్యప్రాస మున్నగు లక్షణాలు కనిపిస్తాయి.

వచన గేయానికి ఉదాహరణ :

కార్యకారణాలు

సముద్రంలో ఓడలు సమ్మెచేస్తే
స్వరాజ్యం వస్తుంది
రైళ్ళరాకపోకలు నిలిచిపోతే
రాష్ట్రం సిద్ధిస్తుంది

జడతకు చైతన్యంరానిది
జనతకు విముక్తి లేదు
బలం లేంది
ఫలం లేదు

నాయకుల వాగ్దానాలు జీర్ణంకాక
జాతికి జ్వరం వస్తుంది
చీకటి వెలుగుల యుగసంధిలో
శాంతిమందు ఛోకొస్తుంది

ప్రజల మనోరథం పరుగులు పెట్టింది
బతుకు మార్గం దూరం తగ్గదు
వేగం లేంది
భాగం లేదు

[కుందుర్తి "యుగే-యుగే" నుండి]

# లేఖా రచన [LETTER-WRITING]

తేలికభాషలో ఉత్తరాలు రాయడం ఒక కళ. ఈ లేఖలను, సాంఘిక లేఖలని, వ్యవహార లేఖలని విభజించవచ్చు. ఈ లేఖారచనలో అన్నింటికి ఒకే పద్ధతిని అనుసరించరాదు. కాబట్టి ఎవరెవరికి ఏ యే రీతిగా ఉత్తరాలు రాయాలో అలవరచుకోవాలి. లేఖను ప్రారంభించు సందర్భంలో లేఖకు కుడిప్రక్క పై భాగంలో తానున్న ఊరు తేదీతో సూచించాలి.

## సాంఘిక లేఖలు

మిత్రులకు, బంధువులకు వ్రాసే లేఖలు, పెండ్లి, పుట్టినరోజు మొదలగు సందర్భాల్లో ఇష్టులకు పంపు పిలుపు పత్రికలు మొదలగు వాటిని సాంఘిక లేఖలంటాను.

సాంఘిక లేఖల్లో తలిదండ్రులకు వ్రాసే సందర్భాల్లో ప్రారంభంలో;

పూజ్యులయిన తండ్రిగారికి
ప్రియమైన నాన్నగారికి
ప్రియమయిన అమ్మ (తల్లి) గారికి

మిత్రులకు లిఖించు లేఖల్లో;

ప్రియతముడగు మిత్రునికి
ప్రియ స్నేహితుడు శ్రీ...కు

పరిచయము లేనివారైతే ;

అయ్యా !
అమ్మా ! — అని సంబోధించాలి.

పేర్లకు పూర్వం మన దేశాచారాన్ని అనుసరించి పెద్దలైన పురుషులకు "మహారాజశ్రీ" "బ్రహ్మశ్రీ" "శ్రీవేదమూర్తులు" మున్నగువాటిని ఉపయోగిస్తారు. అలాగే స్త్రీలకు వ్రాసే సందర్భాల్లో "మహాలక్ష్మీ సమానురా"లని "శ్రీమతి" మున్నగువాటిని ఉపయోగిస్తారు. పిన్నలకు "చిరంజీవి" అని పేర్లకు ముందు చేరుస్తారు. తనకంటె పెద్దలైన వారికి నమస్కారాలు; వందనాలు మున్నగునవి చెప్పాలి. తనకంటె చిన్నవారికి ఆశీస్సులు; దీవెనలు మున్నగునవి చెప్పాలి.

లేఖ చివరిభాగంలో చిన్నవారు పెద్దవారికి వ్రాస్తే 'చిత్తగించవలయును', ఇట్లు 'విధేయుడు' అనిన్నీ, పెద్దలు చిన్నవారికి వ్రాసే సందర్భాల్లో 'గ్రహింపవలయును', ఇట్లు 'శ్రేయోభిలాషి' అనిన్నీ రాయాలి.

## మాదిరి సాంఘిక లేఖలు

# 1

గుంటూరు,
**6-5-73.**

ప్రియమైన నాన్నగారికి,

తమ కుమారుడు సుబ్బారావు నమస్కరించి వ్రాసే లేఖ.

ఉభయకుశలోపరి.

మాకు సంవత్సరాంత పరీక్షలు జరుగుతున్నాయి. నేను సెలవుల్లో హైదరాబాదు రావడానికి ప్రయాణపు కర్చులకు పాతిక రూపాయలు పంపవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

చిత్తగించవలెను.

ఇట్లు
మీ ప్రియమైన **కుమారుడు,**
మాదిరాజు సుబ్బారావు.

చిరునామా :

బ్రహ్మశ్రీ మా॥ రంగారావుగారికి
884, ఎర్రమంజలి కాలనీ,
హైదరాబాదు-4 [ ఆం. ప్ర. ]

## 2

విశాఖపట్నం,
5-6-73.

ప్రియస్నేహితుడు
శ్రీ వెంకటరావుకు,

ప్రేమాభివందనాలు. ఉభయకుశలోపరి.

వేసవి సెలవుల అనంతరం మళ్లీ విశ్వవిద్యాలయంలో రెండవ సంవత్సరం ఎం. ఏ. పూర్తిచేయడానికి విశాఖపట్నం వచ్చాను. ఇచ్చటి సముద్రతీరం నన్ను ఎంతగానో ఆకర్షించింది.

ఇట్లు,
భవదీయుడు,
జాన్ ఏసుదాసు.

చిరునామా:

శ్రీ ఎస్. వెంకటరావు,
గది నెం. 4, యూనివర్శిటీ హాస్టల్,
తిరుపతి [చిత్తూరు జిల్లా]

# వ్యవహార లేఖలు

పుస్తక విక్రేతలకు వ్రాసే లేఖలు, ప్రధానోపాధ్యాయులు మున్నగువారికి వ్రాసే లేఖలు, వార్తాపత్రికల కార్యాలయాలకు వ్రాసే లేఖలు మున్నగు వాటిని వ్యవహార లేఖ లంటారు. వ్యవహార లేఖల్లో కంపెనీలకు వ్రాసే సందర్భాల్లో "మహాశయులారా!, ఆర్యులారా!"—అని సంబోధించి రాయాలి.

## మాదిరి వ్యవహార లేఖలు

## 1

విజయవాడ,
6-2-1973.

పూజనీయులు, ప్రధానోపాధ్యాయులవారికి—

తమ ప్రియశిష్యుడు సత్యనారాయణ అనేక నమస్కారాలు చేసి వ్రాసే విన్నపాలు.

నా శరీరంలో అస్వస్థతగా ఉన్నందున పాఠశాలకు నేడు, రేపు రాలేకపోతున్నాను. కనుక రెండురోజులకు సెలవు మంజూరు చేయవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

చిత్తగించవలెను.

విధేయ శిష్యుడు,
వంగూరి సత్యనారాయణ

చిరునామా : మహారాజశ్రీ ప్రధానోపాధ్యాయులవారికి
సి. వి. రెడ్డి పురపాలకోన్నత పాఠశాల,
విజయవాడ-2

**2**

నెల్లూరు,
7-7-73.

శ్రీయుతులు, మేనేజరు
జనహిత పబ్లికేషన్సు,
రాయనగర్; గన్నవరం
కృష్ణాజిల్లా [ఆం. ప్ర.]

మహాశయులారా !

ఈ క్రింది పుస్తకాల్ని వి. పి. పి. ద్వారా క్రింద కనపర చిన చిరునామాకు పంపగోర్తున్నాను.

1. "చక్కని ఇంగ్లీషు రాయడమెలా ?"
రచన :
ఎం. వి. రామరెడ్డి, M. A., B. T. గారు 2 కాపీలు
2. "ఇంగ్లీషు సంభాషణ కళ"
రచన :
ఎం. వి. రామరెడ్డి, M. A., B. T. గారు 2 కాపీలు
3. "వ్యాకరణాలంకార ఛందోదర్శిని"
రచన :
వి. ఎల్. రెడ్డి, ఎం. ఏ. 1 కాపి

భవదీయుడు,
ఎమ్. సుధాకరబాబు.

మా చిరునామా :
ఎమ్. సుధాకరబాబు
18, పెద్దకాపువీధి,
నెల్లూరు-1 [ఆం. ప్ర.]

# ఫిర్యాదులు (Complaints)

## 1

విజయవాడ,
10-7-1973.

ఆర్. సత్యనారాయణ,
10 వ తరగతి "బి" శ్రేణి
సి. వి. ఆర్. ఉన్నత పాఠశాల,
విజయవాడ-2

సబ్ ఇన్‌స్పెక్టరుగారికి
పోలీసుస్టేషన్
విజయవాడ-2

అయ్యా,

నిన్నటిరోజు నేను పాఠశాలప్రాంగణంలో నాసైకిలు వదలి, తరగతికి వెళ్ళాను. తరగతి పూర్తిఅయిన తర్వాత నా సైకిలుపెట్టిన స్థలానికి వెళ్ళిచూడగా అది కన్పించలేదు.

నా సైకిలు పచ్చనిరంగు కల్గిన రాలీబండి. దాని నెంబరు 35943. నా సైకిలుకు డైనోమో ఉంటుంది.

మీరు దయతో ఈ విషయంలో తగుచర్య తీసుకొని నా సైకిలు కనుగొని నాకు తెలుపవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

ఇట్లు,
విధేయుడు,
ఆర్. సత్యనారాయణ.

# 2

గుంటూరు,
14-6-73.

ఎన్. సురేంద్ర,
25, బ్రాడీపేట,
గుంటూరు.

సబ్ పోస్టుమాష్టారుగారికి
గుంటూరు.

అయ్యా,

గతవారం జనహిత పబ్లికేషన్స్, గన్నవరం (కృష్ణా జిల్లా) వారు పుస్తకాలు వి.పి.పి. లో పంపినట్లు నాకు ఉత్తరం వ్రాశారు. కాని, నాకు ఇంతవరకు వి. పి. పి. అందలేదు.

వారు 5-6-73 తారీకునాడు గన్నవరం సబ్ పోస్టాఫీసు నుండి పంపినట్లు ఉత్తరం వ్రాశారు. పై వి. పి. పి. రిజస్టర్డు పోస్టు నెంబరు 634 అనికూడా తెలిపారు.

కాబట్టి ఈ విషయంలో మీరు దయతో శ్రద్ధ తీసుకుని పై వి. పి. పి.ని కనుగొని నాకు బట్వాడా చేయవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

ఇట్లు,
భవదీయుడు,
ఎన్. సురేంద్ర.

# పత్రికా సంపాదకీయ లేఖలు

ఈ లేఖల్లోని విషయం ఏ ఒక్కరికో సంబంధించింది గాక సర్వసామాన్యంగానో కనీసం ఒక వర్గానికైనా సంబంధించిందిగానో ఉండాలి. విషయం సాధ్యమైనంత సంగ్రహంగా ఉండాలి. అంటే దాదాపు 'కాలం'లో ఏ నాల్గవ భాగానికో సరిపోదగిందిగా ఉండాలి. 'కాలం'—అంటే పేజీలోని కొంతభాగం. పత్రికాలేఖ 'మహాశయా' అనో 'ఆర్యా' అనో ప్రారంభమవుతుంది. చివరిలో వ్రాసినవారి పేరు, గ్రామం, తేదీ రాయాలి. సాధారణంగా పత్రికలకు పంపే లేఖలలోని విషయాలు ఆహారసమస్య, భాషావిషయం, రాకపోకలు, రేషన్—లాంటి సమస్యలుగా ఉండవచ్చు. లేఖలోని భాష సర్వజన పఠనార్హమై ఉండాలి. భాష, శీర్షిక—మున్నగువాటిని మార్చి ప్రకటించే హక్కు సంపాదకులకు గలదు. విషయాన్ని మార్చే హక్కు లేదు. ముఖపత్రలేఖ (covering letter) లో కుడిప్రక్క పంపబడే స్థలం, తేదీ తెలియజేయాలి. ముఖపత్రలేఖకు అనుబంధంగా లేఖా విషయాన్ని జతపర్చాలి. లేఖావిషయం చివర పంపేవారి పూర్తి చిరునామా రాయాలి. ఈ లేఖలను బుక్ పోస్టులో పంపవచ్చును. కవరుపై "For Press" అనిన్నీ "Book-Post" అనిన్నీ రాయాలి. వీటి క్రింద పత్రికయొక్క చిరునామా రాయాలి. కొన్ని మాదిరి లేఖలను ఈక్రింద ఉదాహరిస్తాను. వీటిని ఆధారంగా తీసుకుని లేఖారచన కావించి పత్రికలతో పరిచయం చేసుకోవచ్చు.

## మాదిరి ముఖపత్ర లేఖ [Covering letter]

గన్నవరం,

4-3-1973.

వి. లక్ష్మణరెడ్డి, ఎం. ఏ.,
లెక్చరర్,
వి. కె. ఆర్. కళాశాల,
గన్నవరం. [కృష్ణాజిల్లా, ఆం.ప్ర.]

సంపాదకులు,
"ఆంధ్రప్రభ" దినపత్రిక
విజయవాడ-3

మహాశయా,

దయతో దీనితో జతచేర్చిన విషయాన్ని తమ ప్రముఖ దిన పత్రికలో ప్రకటించగోరుతున్నాను.

ఇట్లు,
మీ విశ్వాసపాత్రుడు,
వి. లక్ష్మణరెడ్డి.

# 1

## డిగ్రీ తరగతులలో భాషాధ్యయన ఆవశ్యకత

మహాశయా !

ఆంధ్ర విశ్వవిద్యాలయం వివిధ సబ్జక్టుల అధ్యయనాలకు సంబంధించిన బోర్డు జూలై 31వ తేదీ జరిపిన సమావేశంలో కొందరు సభ్యులు బి. ఎస్. సి. కోర్సుకు ఇంగ్లీషు భాషాధ్యయనం మాత్రమే కొనసాగించాలని అభిప్రాయం వ్యక్తపరచినట్లు తెలుస్తున్నది. మూడేండ్ల డిగ్రీకోర్సును ప్రవేశపెట్టుటకు పూర్వం బి. ఎస్. సి. కోర్సులో ప్రాంతీయ భాషాధ్యయనం లేనిమాట నిజం. కాని నాటిపరిస్థితులు వేరు. ఆనాడు కళాశాలల్లో ఇంగ్లీషు బోధనా భాషగా ఉండేది. ఈనాడు కళాశాల స్థాయిలో తెలుగు బోధనా భాషగా ప్రవేశపెట్టబడింది. ఈ పరిస్థితులలో సైన్సు సబ్జక్టులను బోధించే అధ్యాపకులకు తెలుగుభాషపై అధికారం అక్కరలేదా ? ఇంటర్మీడియెట్ స్థాయిలో చదివిన తెలుగు సరిపోతుందా ? ఐ. ఏ. ఎస్. పరీక్షలకు తెలుగులో వ్యాస రచనకు సంబంధించిన పేపరు వచ్చే సంవత్సరం నుండి ప్రవేశపెడుతున్నారు. రాష్ట్రప్రభుత్వ పబ్లిక్ సర్వీసుకమీషన్ పరీక్షలో తెలుగు లిటరేచర్ పేపరు ఉంటుంది. పరిపాలనా వ్యవహారాలు ఇకపై తెలుగులో నిర్వహించబడతవి. ఈ పై విషయాలను దృష్టిలోఉంచుకొని కనీసం తెలుగులో ఒక్క పేపరైనా బి. ఎస్. సి. కోర్సుకు నిర్బంధంగా ఉంచడం సబబుగా ఉంటుంది. కాకుంటే క్రమేణా పోస్టు గ్రాడ్యుయేటు కోర్సులను కూడా ప్రాంతీయ భాషల్లోనే బోధించాలనే ప్రభుత్వ ధ్యేయం హాస్యాస్పదం అవుతుంది.

పాఠ్య ప్రణాళికా బోర్డుకు సంబంధించిన కొందరు వక్తలు "తెలుగు అధ్యయనం ఇప్పుడు కూడా నిర్బంధం కాదు. విద్యార్థి తెలుగును నిర్లక్ష్యం చేసి హిందీ లేదా సంస్కృతాన్ని అభ్యసించవచ్చు" అని పేర్కొన్నారు. ఈ విధంగా వీరు పేర్కొనడం అసలు సమస్యను పెడదారి పట్టించడానికే. రెండవ పార్టులో ప్రాంతీయ భాషాధ్యయనం నిర్బంధమా ! కాదా ?

అనేది అసలు సమస్య. తెలుగో, హిందీయో మరో భారతీయభాషో నిర్బంధ భాషగా బోధించబడుతుంది కదా ?

ఈ పై విషయాలను దృష్టిలో ఉంచుకుని విశ్వవిద్యాలయ అధికారులు బి. ఎస్. సి. కోర్సులో కూడా ఇప్పటిలాగే ప్రాంతీయ భాషాధ్యయనాన్ని కొనసాగించాలని కోరుతున్నాను.

వి. లక్ష్మణరెడ్డి,
గన్నవరం, కృష్ణాజిల్లా
[ ఆంధ్రప్రభ నుండి ]

## 2

## సంపూర్ణంగా శిష్టవ్యావహారికం

ఆర్యా !

పాఠ్యగ్రంథాలకు "శిష్ట వ్యావహారిక భాష"ను వాడవలెనని ఆంధ్ర విశ్వవిద్యాలయం కమిటీ సిఫారసు చేసినట్లు వార్త చదివి ఆనందించాను. పి. హెచ్. డి. కి నిర్దేశించిన పరిశోధక వ్యాసాలను శిష్టవ్యావహారికంలో రాయవచ్చునని ఆ కమిటీ సిఫారసు చేసినట్లు తెలుస్తున్నది.

అయితే బి. ఎ, బి. యస్ సి., బి. కాం, వంటి పరీక్షలలో తెలుగు భాషా, సాహిత్యాలకు సంబంధించిన జవాబులను శిష్టవ్యావహారికంలో రాయవచ్చునని కమిటీ సిఫారసు చేయలేదని పత్రికలలో వెలువడిన వార్తలనుబట్టి అర్థం చేసుకోవలసివస్తున్నది.

అంటే, డిగ్రీక్లాసుకు సంబంధించిన తెలుగు భాషా, సాహిత్యాలకు సంబంధించిన పుస్తకాలు శిష్టవ్యావహారికంలో ఉండవచ్చునని, కాని విద్యార్థులు పరీక్షలలో సమాధానాలు గ్రాంథికంలోనే రాయవలెనని అర్థం అవుతుంది.

ఆంధ్ర విశ్వవిద్యాలయం శిష్ట వ్యావహారికాన్ని పాక్షికంగా ప్రవేశ పెట్టే అవకాశం ఉన్నది. శిష్టవ్యావహారికంలో పాఠ్యగ్రంథాలను చదివి గ్రాంథికంలో రాయడం పెద్ద సర్కసే అవుతుంది.

ఈనాడు తెలుగు విద్యార్థి ఇంటర్మీడియెట్, డిగ్రీ తరగతులలో వివిధ శాస్త్రీయాంశాలను శిష్టవ్యావహారికంలో రచించిన పాఠ్య గ్రంథాలలో చదువుతున్నాడు. తెలుగు భాషా తరగతులలో మాత్రం గ్రాంథికభాష నభ్యసిస్తున్నాడు. ఇదొక విలక్షణమైన పరిస్థితిని సృష్టిస్తున్నది. దీనివలన అతడొక అస్తవ్యస్తమైన స్థితికి పాల్పడుతున్నాడు. ఇలాంటి గారడీని తెలుగు విద్యార్థులు ఎన్నో రోజులు నిర్వహించలేరు.

ఈ పరిస్థితి చక్కబడవలెనంటే తెలుగుభాషా తరగతులలో కూడా శిష్టవ్యావహారిక భాషలోనే పఠన పాఠన కార్యక్రమం కొనసాగాలి. భవిష్యత్తులో విద్యార్థి సమాజంలో తన పాత్రను నిర్వహించడానికి గ్రాంథిక భాష ఉపయోగించదు.

ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు భాగశః కాక, సంపూర్ణంగా శిష్టవ్యావహారిక భాషను ప్రవేశపెట్టవలెనని అభ్యర్థిస్తున్నాను.

వి. లక్ష్మణరెడ్డి,
లెక్చరర్, వి. కె. ఆర్. కాలేజి, గన్నవరం, కృష్ణాజిల్లా.

[ ఆంధ్రజ్యోతి నుండి ]

# 3

## విజయవాడ నుండి గన్నవరానికి సిటీబస్సు

ఆర్యా !

విజయవాడ నుంచి ఇబ్రహీం పట్నానికి సిటీ బస్ సర్వీసు ప్రవేశపెట్టారని విజయవాడ ఆర్. టి. ఒ. గారు నిన్నటి వార్తాపత్రికల్లో ప్రకటించడం ముదావహం. విజయవాడ నుండి అంతేదూరంలో ఉన్న గన్నవరానికి కూడా సిటీబస్ సర్వీసు ప్రవేశపెడితే ఈ ప్రాంత ప్రజలకు చాలా ఉపయోగకరంగా ఉంటుంది.

ఏలూరు, తేలప్రోలు, నూజివీడు బస్సులను రింగ్ రోడ్డు వైపుగా నడపడం ప్రారంభించిన తర్వాత గన్నవరం ప్రాంత ప్రజలు చాలా ఇబ్బందులు పడుతున్నారు. బస్సుచార్జి పెరిగింది. ప్రయాణానికి ఎక్కువ కాలం

కూడా తీసుకుంటుంది. కాబట్టి ఏలూరు రోడ్డుమీదుగ ఇప్పుడు నిడమానూరు వరకు నడుస్తున్న బస్సులను గన్నవరంవరకు పొడిగిస్తే చాలా ప్రయోజనకరంగా ఉంటుంది. గన్నవరంలో డిగ్రీ కళాశాల ఉంది. చాలామంది విద్యార్థులు రోజూ విజయవాడనుంచి నానా బాధలకు గురియై గన్నవరం చేరుకుని చదువు కొనసాగిస్తున్నారు. అలాగే గన్నవరంలో సెయింట్ జాన్స్ ఇంగ్లీషు కాన్వెంట్ పాఠశాలను గాబ్రియల్ మిషన్ వారు నిర్వహిస్తున్నారు. ఈ పాఠశాలకు కూడా విజయవాడ నుంచి రోజూ విద్యార్థులు వస్తున్నారు. గన్నవరంలోని బ్యాకన్ ఫ్యాక్టరీ, పశుగ్రాసం తయారు చేసే ఫ్యాక్టరీ, సెమెన్ కలక్షన్ సెంటరు, ఇంకా అనేక కర్మాగారాలకు నిత్యం విజయవాడ నుంచి అనేకమంది వస్తుంటారు,

ఈ విషయాల్ని దృష్టిలో ఉంచుకొని ప్రైవేటు సంస్థచే గాని, ఆర్. టి. సి. వారిచే గాని ఏలూరురోడ్డుమీదుగ కాళేశ్వరరావు మార్కెట్టు నుంచి సిటీబస్ సర్వీసు నడిపించే ఏర్పాటును విజయవాడ ఆర్. టి. ఓ. గారు గావిస్తారని ఆశిస్తున్నాను.

వి. లక్ష్మణరెడ్డి,
లెక్చరర్, వి. కె. ఆర్. కాలేజి, గన్నవరం.

[ ఆంధ్రప్రభ నుండి ]

## వినతి పత్ర రచన

**1**

టంగుటూరు,
7-5-73.

పోస్టుమాస్టర్ జనరల్‌గారికి
హైదరాబాద్ సర్కిల్,
హైదరాబాద్. ఆం.ప్ర.

అయ్యా,

విషయము :- ఇన్‌లాండ్ కవర్ల కొరత

ప్రకాశంజిల్లా టంగుటూరు అనుమా గ్రామంలో ఉన్న సబ్ పోస్టాఫీసులో గత ఆరు నెలలుగా ఇన్‌లాండ్ కవర్లు దొరకడంలేదు. పోస్టల్ సిబ్బందిని విచారించగా వారు తగినంత స్టాకుకొరకు ఆర్డర్లు పెడుతున్నామని పైనుంచి నెలకొకసారో లేక రెండుసార్లో స్టాకు కొద్దిగా మాత్రమే వస్తున్నట్లు చెబుతున్నారు. ఆ వచ్చిన కొద్దిస్టాకును కొంతమంది ముందుగానేకొని ఇన్‌లాండ్ కవరు ఒకటికి 22 పైసల చొప్పున అమ్ముతున్నట్లు తెలుస్తూంది. పోస్టాఫీసులో ఇవి దొరకని కారణంగా సామాన్య ప్రజలు వీటిని హెచ్చు రేట్లకు ఇతరులవద్ద కొనవలసిన దుస్థితి పట్టింది.

కనుక తమరు దయతో ఈ విషయంలో శ్రద్ధవహించి వెంటనే తగిన చర్యలు గైకొని మా గ్రామంలో ఉన్న పోస్టాఫీసుకు తగినన్ని ఇన్‌లాండ్ కవర్లు సప్లయి చేయించి ప్రజల ఇబ్బందులను తీర్చవలసిందిగా కోరుతున్నాము.

ఇట్లు,
గుండ్లపల్లి వెంకట నరసింహాం
కార్యదర్శి, బి. యల్. టి. డి. కం. స్టాఫ్ అసోసియేషన్

**2**

రాజమండ్రి,
10-9-1978.

వి. ఆర్. శేఖర్,
అడ్వొకేట్,
ఇన్నీసుపేట, రాజమండ్రి.

విద్యాశాఖ డైరెక్టరుగారికి
ఆంధ్ర ప్ర. ప్రభుత్వం,
హైదరాబాదు, ఆం. ప్ర.

అయ్యా,

విషయం—ఏడవతరగతి పుస్తకాల కొరత

ప్రభుత్వం ప్రచురించిన పాఠ్యపుస్తకాలలో ఈ సంవత్సరం ముఖ్యంగా ఏడవ తరగతికి సంబంధించిన సైన్సు, సోషల్ స్టడీస్, లెక్కలు, తెలుగు పుస్తకాలు చాలా చోట్ల దొరకడం లేదు. విద్యార్థులు, తల్లిదండ్రులు చాలా ఆందోళన చెందుతున్నారు. అవి ఎక్కడైనా దొరికినా, చాలా హెచ్చింపు రేట్లకు దొరుకుతున్నాయి. దీనివలన బీద విద్యార్థులకు మరీ దెబ్బ తగులుతున్నది. కనుక ఈ విషయంలో తాము తగు శ్రద్ధ వహించి పై పుస్తకాలు త్వరగా అన్నిచోట్లకు పంపిణీ అయ్యే విధంగా చూడవలసిందని కోరుతూ.

ఇట్లు,
భవదీయుడు,
వి. ఆర్. శేఖర్.

# 3

కడపజిల్లా జమ్మలమడుగు డిప్యూటీ కలెక్టరుగారి
దివ్యసముఖమునకు

మద్దెన రామయ్య కుమారుడు మద్దెన చెన్నయ్య
దాఖలు చేసుకొన్న అర్జీ విన్నపము.

అయ్యా,

నేను చాలా వెనుకబడిన కులం వాణ్ణి. నాకు ఏవిధమైన పిత్రార్జితం లేదు. కూలిపని చేసుకొని జీవిస్తున్నాను. నాకు ముగ్గురు కొడుకులు, ఇద్దరు ఆడపిల్లలుఉన్నారు. ఒకచోట స్థిరంగా నివాసం ఏర్పరచుకొనడానికి ఎచ్చటను నాకు స్థలం లభించలేదు. కనుక ఈ బీదవాడిమీద దయఉంచి సర్వే నెం. 216 గల ప్రభుత్వ బంజరు భూమిలో ఒకచోట పాక వేసుకొనడానికి గాను 300 గ॥లు భూమి నాకు ఇప్పించవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

చిత్తగించవలెను.

జమ్మలమడుగు, ఇట్లు,
10-1-1974 మద్దెన చెన్నయ్యవ్రాలు.

# అనుబంధం

## 1

## సంస్కృత సంధులు

### 1. సవర్ణ దీర్ఘసంధి.

అకార-ఇకార-ఉకార-ఋకారాలకు సవర్ణాలు పరమైతే వాటి దీర్ఘాలు ఏకాదేశమవుతాయి. సవర్ణమంటే సమానవర్ణం.

ఉదా:- రామ+ఆజ్ఞ=రామాజ్ఞ (అ+ఆ)=ఆ
ముని+ఇంద్రుడు=మునీంద్రుడు (ఇ+ఇ)=ఈ
గురు+ఉత్తముడు=గురూత్తముడు (ఉ+ఉ)=ఊ
పితృ+ఋణం=పితౄణం (ఋ+ఋ)=ౠ

ఏకాదేశమంటే పూర్వ పర స్వరాలు రెండింటికి మారుగా ఒకేఅచ్చు రావడం. ఆదేశమంటే ఒక అచ్చు స్థానంలో మరొక అచ్చు (హల్లు) రావడం. ఈ రెండింటికి గల తేడాను గుర్తించాలి.

### 2. గుణసంధి

అ-ఆలకు ఇ-ఈలు పరమైతే ఏకారం ఏకాదేశమౌతుంది
,, ఉ-ఊలు ,, ఓకారం ,,
,, ఋ ,, అర్ కారం ,,

ఉదా:- అమర+ఇంద్ర=అమరేంద్ర (అ+ఇ)=ఏ

సూర్య+ఉదయం=సూర్యోదయం (అ+ఉ)=ఓ

మహా+ఋషి=మహర్షి (ఆ+ఋ)=అర్

## 3. వృద్ధి సంధి.

అఆలకు ఏఐలు పరమైతే ఐకారం ఏకాదేశమౌతుంది.

,, ఓఔలు ,, ఔకారం ,,

,, ఋ ,, ఆర్‌కారం ,,

ఉదా:- లోక+ఏక=లోకైక (అ+ఏ)=ఐ

మహా+ఐశ్వర్యం=మహైశ్వర్యం (ఆ+ఐ)=ఐ

మహా+ఓషధి=మహౌషధి (ఆ+ఓ)=ఔ

మహా+ఔషధం=మహౌషధం (ఆ+ఔ)=ఔ

వసన+ఋణం=వసనార్ణం (అ+ఋ)=ఆర్

## 4. యణాదేశ సంధి.

ఇ, ఉ, ఋ, లకు సవర్ణాలుకాని అచ్చులు పరమైతే వాటికి వరుసగా య, వ, ర—అను హల్లులాదేశాలౌతాయి.

ఉదా :- అతి+అంతం=అత్యంతం (ఇ+అ)=య

విష్ణు+ఆలయం=విష్ణ్వాలయం (ఉ+అ)=వ

పితృ+ఆజ్ఞ=పిత్రాజ్ఞ (ఋ+ఆ)=ర

## 5. శ్చుత్వసంధి.

స, త, థ, ద, [illegible] న అను హల్లులకు శ, చ, ఛ, [illegible], ఝ, ఞ - అను హల్లులు చేరితే స, త, థ, ద, ధ, న-లు

వరుసగా శ, చ, ఛ, జ, ఝ, ఞ–లుగా మారుతాయి.

ఉదా :– శిరస్+చుంబి=శిరశ్చుంబి.

బృహత్+జాతకం=బృహజ్జాతకం

6. అనునాసిక సంధి.

'క–చ–ట–త–ప' లకు 'న–మ'లు పరమైతే ఆయా వర్గాల్లోని అనునాసికాలు ఆదేశాలౌతాయి.

ఉదా :– దిక్+నాగం=దిఙ్నాగం

వాక్+మయం=వాఙ్మయం

జగత్+నాథ=జగన్నాథ

జగత్+మయం=జగన్మయం

7. విసర్గసంధి (లేక సకారాంతసంధి)

a. అకారం పూర్వమందుగల విసర్గకు అకారం పరమైతే వాటికన్నింటికీ జేరి ఓకారమౌతుంది.

ఉదా :– మనః (మనస్)+అభిలాష=మనోభిలాష

b. అకారం పూర్వమందుగల విసర్గకు వర్గతృతీయ చతుర్థ, పంచమాక్షరాలూ, అంతస్థాలూ, హకారం పరమైతే ఓకారం వస్తుంది.

ఉదా :– తపః+బలం=తపోబలం

మనః+రథం=మనోరథం.

2

# చరిత్రపుటల్లో తెలుగుదేశం

శ్రీశైలం, ద్రాక్షారామం, కాళేశ్వరం—అనేవి సుప్రసిద్ధ శైవ క్షేత్రాలు. ఈ త్రిలింగాలకు మధ్య ఉండే దేశానికి త్రిలింగదేశమని పేరు వచ్చింది. త్రిలింగదేశమే క్రమంగా తెలుగుదేశంగా మారింది.

పై మూడు శివక్షేత్రాల్లో ఒకటైన శ్రీశైలం ప్రస్తుతం కర్నూలు జిల్లాలోనూ, ద్రాక్షారామం తూర్పుగోదావరి జిల్లాలోనూ, కాళేశ్వరం తెలంగాణ మండలి ఆదిలాబాదు జిల్లాలో గోదావరి ప్రాణహితల సంగమస్థానంలోనూ ఉన్నాయి. ఈ విధంగా తెలుగుదేశంలోని ప్రసిద్ధ విభాగాలైన రాయల సీమ, సాగరసీమ, తెలంగాణాలు మూడింటినీ తెలుగువారి పవిత్రమైన కాణాచిగా సూచితమయింది.

తెలుగు దేశాన్ని పరిపాలించిన రాజవంశాలలో మొదట పేర్కొనదగినవారు శాతవాహనులు. శ్రీముఖుడూ, హాలుడూ, గౌతమీపుత్రశాతకర్ణి, వాశిష్ఠీపుత్రపులుమాయి, యజ్ఞశ్రీశాతకర్ణి మున్నగు శాతవాహన వంశానికి చెందిన రాజులు ముప్పైయిద్దరు క్రీ॥ పూ॥ 225 నుండి క్రీ॥ శ॥ 250 వరకు అంటే షుమారు 450 సంవత్సరాలు దక్షిణాపథాన్ని పాలించారు. శాతవాహన సామ్రాజ్యం అత్యున్నత దశలో ఉన్నప్పుడు బ్రహ్మాండమైన విస్తృతి కలిగిఉండేది. దక్షిణాన మద్రాసు రాష్ట్ర తూర్పుకోస్తాలో ఉన్న కడలూరు మొదలు ఉత్తరాన కళింగపట్నం వరకున్నూ పడమటి కోస్తాలోని కచ్ వరకు వ్యాపించిన విస్తృత సామ్రాజ్యమది. అంటే నేటి ఆంధ్రప్రదేశేకాక, మైసూరు, బొంబాయి, మధ్యప్రదేశ్ రాష్ట్రాలు, మద్రాసు రాష్ట్రంలో కొంత యీ సామ్రాజ్యంలో ఉన్నవన్నమాట. విశాలమయిన శాతవాహనుల సామ్రాజ్యంలో, ఈనాటి మన ఆంధ్ర ప్రదేశ్ అంతర్భాగంగా ఉండేది. తెలంగాణా, కోస్తా ప్రాంతం, రాయల సీమ విడివిడిగా ఉండేవి కావు.

శాతవాహనుల తరువాత— అంటే క్రీ॥ శ॥ 3వ శతాబ్దం మొదలు రెండు మూడు వందల సంవత్సరాల కాలం తెలుగు దేశం భిన్నాభిన్నమై ఇక్ష్వాకులు, బృహత్ఫలాయనులు, శాలంకాయనులు, పల్లవులు, విష్ణుకుండినులు, గాంగులు మున్నగు రాజవంశాలచే పరిపాలింపబడింది. తెలుగు మాగాణమంతా చిన్న చిన్న సంస్థానాలుగా చీలిపోయింది.

క్రీ॥ శ॥ 7వ శతాబ్దంలో రెండవ పులకేశి అనే చాళుక్యరాజు దిగ్విజయయాత్రలు చేసి నర్మదానదికి దక్షిణ భాగాన్నంతా, తన ఏలుబడిలోకి తెచ్చాడు. ఇతని ప్రతినిధులే వేంగిదేశాన్ని పరిపాలిస్తూ తూర్పు చాళుక్యులని పిలవబడ్డారు. క్రీ॥ శ॥ 625 మొదలు రమారమి 11వ శతాబ్దాంతం వరకు తూర్పు చాళుక్యులు దేశాన్ని శాసించారు. తూర్పు చాళుక్యుల రాజ్యం ఉత్తరాన విశాఖపట్నం జిల్లాలోని చీపురపల్లి మొదలుకొని, దక్షిణాన నెల్లూరు వరకునూ, పశ్చిమాన కర్నూలు మండలములోని మార్కాపురం, తెలంగాణాలోని కుక్కునూరు వరకునూ, తూర్పు సముద్రాన్నంటి వ్యాపించింది. తెలుగుదేశమంతా పూర్వ చాళుక్యుల అధీనంలో ఉండేది కాదు. తెలంగాణాలోని విశేష భాగం, నిజామాబాదు, మెదకు ప్రక్కన రాయలసీమ తో పశ్చిమ చాళుక్యులకునూ, రాష్ట్రకూటులకునూ స్వాధీనమై ఉండేది. మధిర, మానుకోట తాలూకాలు వేంగి చాళుక్యులకు సామంతులయిన ముదిగొండ చాళుక్యుల పాలనలో బడి ఉండేది. రాష్ట్రకూటుల కాశ్రితులయిన వేములవాడ చాళుక్యులచే, కరీంనగరం జిల్లా పాలింపబడేది. ఆ కాలంలో అంటే క్రీ॥ శ॥ 9వ శతాబ్దం నాటికి, మానుకోట, మధిర తాలూకాలు తప్ప మిగిలిన తెలంగాణామంతా రాష్ట్రకూటుల ఆధిపత్యంలో ఉండేది.

చాళుక్యుల సామంతులలో కాకతీయ వంశస్థులు అనుమకొండ రాజ్యాన్ని పాలిస్తూ ఉండేవారు. కొంతకాలానికి వారు వారి స్వాతంత్ర్యాన్ని ప్రకటించారు. కాకతీయులకు ఓరుగల్లు రాజధాని. దీన్నే ఏకశిలానగరం అని కూడా అంటారు. క్రీ॥ శ॥ 1050 మొదలు 1350 వరకు, అంటే షుమారు 300 సంవత్సరాలు కాకతీయులు పరిపాలించారు. కా

